"శ. సం. 1349 (క్రీ. శ. 1427) రామాయణమునకు టీక వ్రాసిన సింగయ మాధవనృపాలునియొద్ద మంత్రిగానున్న పోతరాజు నకుజుండగు నయ్యలామాత్యుని కొడుకగు గౌరన 15 శతాబ్ది పూర్వార్ధమున నుండెననుటకు సందేహములేదు" అని శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు వ్రాసిరి.

"అసమసన్నాహ గజపతి సప్తాంగహరుండు" అని చెప్పఁబడియుండుటచేత శ. సం. 1382 అనఁగా, సం. 1460 క్రీ. శ. ములో కపిలేంద్ర గజపతిచే శ్రీశైలమున వేయింపఁబడిన ఓఢ్రశాసనమును (ఎ. డి. 1915 సం. నెం. శా.) సంబంధించియుండవచ్చును.

3. వెలుగోటివారి వంశావళిలో (మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణము)

"శాంతభిక్షావృత్తి జగమెల్లనెఱుఁగ శ్రీశైలపట్టంబునఁ జాటినాఁడు లీల నొప్పారు మాదయలింగ విభుఁడు" అని యున్నది. పుట. 51

ఈ మాదయలింగఁడు రాజమహేంద్ర రాజ్యముపయిని 1426—1427 (క్రీ. శ.) సంవత్సరములలో దండెత్తెనని శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు పైగ్రంథము నుపోద్ఘాతములో వ్రాసియున్నారు.

"శాంతభూధవలింగ జనపాలుఁ గొట్టువె రాణమీఱఁగఁ గృష్ణరాయలెఱుఁగ" పు. 80. అని గని తిమ్మనాయనిగూర్చి యాగ్రంథమందే గలదు. ఈ విజయము 1509—1527 క్రీ. శ. నడుమజరిగియుండవలెనని పై "కృష్ణరాయలెఱుఁగ" అను వాక్యముచే నూహింపఁబడినది.

4. శ్రీశైలమునందలి యొకశాసనము :—

(ఎ. రి 1915 నెం. 43)—వి. రంగాచారి. మదరాసు రాజధాని శాసనములు వాల్యుము II -నెం. 479 లో వీరశైవ గురువైన శ్రీశాంతభిక్షావృత్తి అయ్యవారి ఆజ్ఞానుసారముగా మల్లికార్జునస్వామివారి పూలతోట కొఱకు చెఱువు; భోగవతీ నది మీది కట్ట మరమ్మతు చేయించినట్లు శ.సం. 1499 భావ వైశాఖ బహుళ అమావాస్య శుక్రవారము విజయనగరరాజైన వీరప్రతాప రామరాజదేవయ్య మహారాజు వాజ్ఞ చొప్పున వేయింపఁబడినది. (ఈరాజు మూఁడవ రామరాజని తెలియుచున్నది. ఇది క్రీ.శ. 1576 కాని, 1577 కాని కావలెను. భావ సం.రము క్రీ. శ. 1574—75 అగుచున్నది. తిథిలో తప్పుండవచ్చును.)

పై శాసనములను గ్రంథములనుబట్టి శాంతభిక్షావృత్తినామము క్రీ శ. 1424, 1440, 1460, 1509—29, 1574 సంవత్సరములతో సంబంధించినట్లు తెలియుచున్నది.

భిక్షావృత్తి అయ్యగారి నామమును జేర్చుకొన్న శాసనములు శ. సం. 1440 మొదలు శ. సం. 1484 (క్రీ. శ. 1518—1562) వఱకును 13 లభించుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| ఎపి. రి. | సం. 1915–నెం. 12 ర. | శ.సం. 1440 ఈశ్వర. | సిద్ధభిక్షావృత్తి అయ్యంగారు |
| ,, | ,, 1938–నెం. 201<br>నెం. 202 | శ.సం. 1453 ఖర | భిక్షావృత్తి అయ్యంగారు<br>(జైనగిరి వాసస్థానము) |
| ,, | ,, 1938–నెం. 306 | శ.సం. 1471 సౌమ్య. | సిద్ధభిక్షావృత్తయ్య |
| ,, | ,, 1938–నెం. 205 | శ.సం. 1472 సాధారణ | ,, |
| ,, | ,, 1938–నెం. 316 | శ.సం. 1474 పరీధావి | సిద్ధభిక్షావృత్తి అయ్యంగారు |
| ,, | ,, 1892–నెం. 339<br>(దహిశా IV నెం. 799) | శ.సం. 1474 (?) పరీధావి | ,, |
| ,, | ,, 1911–నెం. 489 | శ.సం. 1474 పరీధావి | ,, |
| | వి. రంగాచారిగారి<br>మదరాసు రాజధాని<br>శాసనము వా II<br>పుట 945 నెం. 882 | శ.సం. 1474 పరీధావి | వీరశైవసిద్ధభిక్షావృత్తి అయ్యవారు |
| ,, | ,, 1918–నెం. 202 | శ.సం. 1480 కాళయుక్తి | భిక్షావృత్తిఅయ్య |
| ,, | ,, 1933–నెం. 379 | శ.సం. 1464(?)శుభకృత్ | అజాతివీరశైవ సిద్ధభిక్షావృత్తి అయ్యవారు |
| ,, | ,, 1919–నెం. 686 | శ.సం. 1484 దుందుభి | ,, |
| ,, | ,, 1923–నెం. 431 | శ.సం. 1484(?) దుందుభి | ,, |
| ,, | ,, 1936–నెం. 293 | శ.సం. 1484 దుందుభి | ,, |

పైని బేర్కొనఁబడిన శాసనములందు రెండు పేళ్లు కనఁబడుచున్నవి. 1. సిద్ధభిక్షావృత్తి అయ్యవారు, 2. అజాతి వీరశైవ సిద్ధభిక్షావృత్తి అయ్యవారు. తొలిపేరితో నున్న శాసనములు 1440 మొదలు 1480 శ. సం. వఱకును—రెండవ పేరుగలవి 1464 లో నొకటి (సందిగ్ధ కాలముతోను) 1484 లో మూఁడు శాసనములలోను గనుపట్టు చున్నవి. కాని వారాణసీ సిద్ధభిక్షావృత్తి అయ్యవారి శాసనమొకటియును గనుపట్ట లేదు. నెం. 205 సం. 1938, శాసనములో సిద్ధభిక్షావృత్తి అయ్యకు "శ్వేతాంబర తల గొండగండ, బిజ్జల రాయమానమర్దన" యను బిరుదములున్నవి.

శాంతభిక్షావృత్తి, సిద్ధభిక్షావృత్తి, అజాతి వీరశైవ సిద్ధభిక్షావృత్తి అను నీ మువ్వురును భిన్నులా? అభిన్నులా? అనునంశము తేలపడవలెను. అభిన్నులగినచో సుమారు శ. స. 1340 నుండి శ. సం. 1484 వఱకును 144 సంవత్సరములు ఒక్క వ్యక్తియే యధికారమున నుండెనని యూహించుటకు వీలులేదు. ఒక యధికార పీఠమునే భిన్నభిన్నవ్యక్తులు వేర్వేరు కాలములలో భిన్ననామములతో గురుపరంపరగా పరిపాలించియుండవచ్చును. అట్లయినచో వారాణసీ సిద్ధభిక్షావృత్తి యతినాథుఁడు

ప్రకృతము ఏర్పడిన గురుపరంపరలో నొక్కఁడయి యుండవచ్చును. ఈయూహయే సత్యమైనచో ఈవారాణసీ సిద్ధభిక్షావృత్తి యెప్పుడు పాలించియుండవచ్చునో తెలియుట కవకాశము లేదు. ఈపేరు శాసనములలో నేను వెదకినంతవఱకుఁ గనుపట్టలేదు. శాంతభిక్షావృత్తి నామము సుమారు శ. సం. 1346—1479 వఱకును, సిద్ధభిక్షావృత్తి నామము శ. సం. 1440 మొదలు 1480 వఱకును, అజాతి వీరశైవ సిద్ధభిక్షావృత్తి నామము శ. సం. 1464 మొదలు 1484 వఱకును శాసనములలో గనుపట్టుచున్నది. పయివానిలో శాంతభిక్షావృత్తిని పేర్కొన్న (43 నెం.రు 1915 ఎ. డి.) శాసనము కాలము కుదరక తప్పుగానుండుటచేతను (1933 వ. సం. 379 వ నెంబరు) శాసనము అసంపూర్ణముగాను కేవలము శోభకృత్ అనిమాత్రముండి శక సంవత్సరము పేర్కొనకుండుటచేతను, అది పొరపాటన్నవని వానిని పరిహరించినచో సిద్ధభిక్షావృత్తి శ. సం. 1440—1480 వఱకును 40 సం.రములు, అజాతివీరశైవ సిద్ధభిక్షావృత్తి శ. సం. 1480 నుండి తరువాతను పాలించెనని యూహింపనగును.

శ్రీ కృష్ణరాయలు క్రీ. శ. 1509 అనగా 1431 శ. సం. పాలనకు వచ్చిన తరువాత కొంచెము కాలములో ముక్తిశాంతభిక్షావృత్తి పాలనమంతముకాఁగా, 1440 శ. సం. సిద్ధభిక్షావృత్తిపాలనకు ముందు కొన్ని సంవత్సరము లీ 'వారాణసీ సిద్ధభిక్షావృత్తి' పాలనము జరిగి యుండవచ్చును. ఈయూహ సత్యమైనచో వారాణసీ సిద్ధభిక్షావృత్తి యతినాథుని మనుమఁడును, తాతగారి పరిణతవయః కాలముననే ప్రసిద్ధికి వచ్చియుండవచ్చును. లేకున్నచో వారాణసీ సిద్ధభిక్షావృత్తి యతినాథుని మనుమని నంతగాఁ గవి ప్రశంసించియుండఁడు. యతినాథునికి స్థానమునుబట్టియు అధికారమునుబట్టియు వచ్చిన గొప్పఁదనము అతని కొమారునియందును మనుమని యందును ఆయన జీవితకాలముననే సంక్రమించియుండవచ్చును. కవి వర్ణనను పరిశీలించినను కృతిభర్తహితునియందు విశేషము చెప్పికొనందగిన ప్రభావాదికముగాని మహత్త్వముగాని కనుపట్టదు. కాఁబట్టి తాతగారి ఖ్యాతివలనను గొప్పదనమువలనను వీనికిని ప్రాముఖ్యమేర్పడి యుండుననుట యుక్తమని తోఁచుచున్నది.

అప్పుడు శైవాచార సంగ్రహకృతిభర్త శ. స. 1440 కి ముందు (1518 క్రీ. సంవత్సరము) ఉండి ఈ గ్రంథమును కృతిపొందియుండవచ్చును.

కృతికర్తయైన తిమ్మకవి మల్లయమంత్రికి పెదతండ్రి కుమారుఁడైనచో 1470 (క్రీ. శ.) ప్రాంతమున నుండి యుండవచ్చునని తేల్చితిమి. ఆకాలమునకును ప్రస్తుతము తేలిన 1518 క్రీ. శ. సంవత్సరమునకును సుమారు 48 సంవత్సరములు భేదము కన్పించుచున్నది. తిమ్మకవి క్రీ. శ. 1470 ప్రాంతములో చిన్నవాఁడయియుండి 60 సంవత్సరముల వయసులో పున నీగ్రంథమును రచియించి యుండవచ్చునేమో.

మొత్తముమీఁదఁ దిమ్మకవి కృష్ణరాయల కాలమువాఁడై యుండియుండవచ్చునని తోఁచుచున్నది. క్రీ. శ. 1510 సం.ర. సమీపమున నీగ్రంథము రచియింపఁబడినట్లు తోఁచుచున్నది.

ఇంతియుకాక కృతిభర్త పండితారాధ్య మహాదేశికుని శిష్యుఁడనని చెప్పియున్నాఁడు. ఈ పండితారాధ్యుఁడెవ్వఁడో యెప్పటివాఁడో, అతని మహత్త్వపాండిత్యములేవో తుది కే గ్రామవాసుఁడో కూడఁ దెలుపలేదు. కాఁబట్టి యీ మార్గమునఁ గవికాలము నిర్ణయించుట కాధారములేదు. తిమ్మకవి శివకవులనుగాని, భవికవులనుగాని యెవ్వరినైన స్తుతింపలేదు. ఆతఁడు గ్రహించిన శైవమత ప్రతిపాదక సంస్కృత గ్రంథములైన 'శారదాతిలకము' 'శైవరత్నాకరము' కాలమును దెలిసికొనుటకుఁ బ్రయత్నింపవలయును. పై విచారణమున నీ గ్రంథము క్రీ. శ. 1510 వ సం.రమునకు వ్రాయఁబడియుండునని తాత్కాలికముగా నిర్ణయము చేయఁబడినది.

## కవిత్వము

ఇది కేవల విషయప్రధానమైన మతగ్రంథముగావున నిందుఁ గవిత్వమునుగూర్చి విశేషము విమర్శింపవలసిన యవసరములేదు. పద్యములు పాదపూరణాదులు లేక కొంత బిగువుగలిగియున్నవి. చాలవఱకుఁ గవి లాక్షణికుల మార్గమునే యనుసరించినట్లు తోఁచుచున్నది. శివకవులలోఁ గలవని సామాన్యముగాఁ జెప్పఁబడునట్టి యతిప్రాసాది విశేషములుగాని ప్రయోగములుగాని యీ గ్రంథమునందులేవు.

## సంస్కరణము

ప్రాచ్యలిఖిత పుస్తకాగారమునందున్న ప్రతుల ననుసరించియే యీ ముద్రణము చేయఁబడినది. అందుఒక తాటియాకుప్రతి ఒక కాకితపు ప్రతియు నున్నవి. కాకితపుఁ ప్రతి తాటియాకు ప్రతినిజూచి వ్రాయంబడియున్నట్లు తోఁచుచున్నది. వ్రాయసగాండ్ర తప్పులు అధికముగానున్నవి. పాఠభేదములుగాని గ్రంథపాతములుగాని విశేషములేవు.

ఈ గ్రంథమును సంస్కరించి ప్రచురింపవలసినదని నన్నడిగిన పుస్తకాగారాధికారులకు వందనములు—సిద్ధభిక్షావృత్తి కాలవిషయమున నేను చేసిన పరిశోధనము మున్ముందు ఇతర గ్రంథముల కాలనిర్ణయ విషయమున పనికివచ్చునేమోయని యాసించుచున్నాను.

వా ల్తేరు, 19—1—51

ఇట్లు - సుజనవిధేయుడు,
సోమయాజి

# శ్రీ శైవాచారసంగ్రహము

## తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 14 | బహాశిని | బహ్వాశిని |
| 10 | 4 | నిలిచి | నిలిపి |
| ,, | 14 | బధము | బంధము |
| , | 22 | ణాఖ్యమున | ణాఖ్యమన |
| 11 | 16 | గావిచినక | గావించినక |
| 12 | 28 | అంగుష్ఠంబున | అంగుష్ఠంబుల |
| 14 | 24 | మ్యూత్మరాకాయ | మూర్త్యాత్మకాయ |
| 6 | 1 | యగుశాంతి | యవుశాంతి |
| 23 | 20 | సుమబండ్దసరము | సుమంబద్ధసరము |
| 30 | 12 | నకల...బడయ | సకల...బడయు |
| 34 | 2 | ప్రసంబుల | ప్రసవంబుల |
| 37 | 6 | బ్రియతుఁడ | బ్రయతుఁడ |
| 39 | 5 | కలరిగ | కలగర |
| 46 | 10 | సంగ్రహంబును | సంగ్రహంబను |
| 52 | 2 | చుక్కల | చుక్కలు |
| ,, | 17 | పలము | ఫలము |
| ,, | F.N. | సాంజ్ఞ | సంజ్ఞ |
| 53 | 18 | వారాణశి | వారాణసి |

ఈపుటలో అనేక స్థలముల 'ఫలము' అను శబ్దము 'పలము' గా నచ్చుపడినది.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 55 | 8 | న్వాయంభువ | స్వాయంభువ |
| ,, | 21 | భరపరా | భవపరా |
| 56 | 11 | కుస్ | కుస్ |
| ,, | 23 | నంకరము | సంకరము |
| 61 | 26 | భూజింప | బూజింప |
| 65 | 2 | పంతం | పరతం |
| ,, | 5 | పొరయందు | పొరఁడు |
| 67 | 26 | మనుజుఁను | మనుజుని |
| 68 | 11 | వాశిష్టంబు | వాశిష్ఠంబు |

పైని నిరూపింపబడిన స్థలములలోగాక మఱి కొన్నియెడల చిన్నచిన్న స్ఖాలిత్యము లున్నవి. అవి మిక్కిలి సులభముగా దెలియఁగలవని విడిచితిని.

ఓమ్

# శైవాచారసంగ్రహము

## ప్రథమాశ్వాసము



ఉ. శ్రీరమ్యాబ్జదళాక్షముఖ్య సురసంసేవ్యుండు, కృష్ణానదీ
తీరస్థాయుఁడు, మల్లికార్జున మహాదేవుండు, శ్రీశైలరా
డారాముండు, శివామనోహరుఁడు, నిత్యానందచిద్రూపుఁ డిం
పారన్ విస్సయగన్నధీమణి కభీష్టార్థంబు లిచ్చున్ దయన్. 1

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబుఁజేసి పురాతనాద్యతన సుకవి సంకీర్తనం బాచరించి సకలలోక హితార్థంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపవలయునని తలంచినంత. 2

సీ. అఖిల జగత్కర్తయగు నుమాభర్తకు
శ్రీనగాధిపునకు సిద్ధలింగ
తనునకు మల్లికార్జున మహాదేవున
కపరావతారమై యఖిలదిశలఁ
జెలఁగి వారాణసీ సిద్ధభిక్షావృత్తి
యతినాథు నాత్మజుఁడై ధరిత్రి
వీరశైవాచార విభవంబు విశదంబు
గాఁ బ్రతిష్ఠించి యక్కజముగాఁగ

గీ. సకల ధర్మంబులును సప్తసంతతులును
భూతదయయును నాశ్రితపోషణంబుఁ
బ్రణుతికెక్కిన రేమయ ప్రభునిసుతుఁడు
వీరభద్రుండు పెంపొందు విమలకీర్తి. ౩

సీ. ఫాలనేత్రము లేని ప్రమథాధినాథుండు
    కరటివక్త్రుఁడు గాని గణవిభుండు,
యజ్ఞవిఘ్నంబు సేయని వీరభద్రుండు
    గోత్రభేదంబు గైకొనని గుహుఁడు,
పశువేషము ధరింపని నందికేశుండు
    రమ్యత్వ మెడలని రాజరాజు,
తనువికారంబు పొందని భృంగిరిటిమూర్తి
    కందు మైఁ జెందని చందురుండు,

గీ. భూరిగాంభీర్య విక్రమ భూరిశక్తి
పరమవిజ్ఞాన వితరణ భక్తిభావ
రమ్యకాంతుల గేమయప్రభుని సుతుఁడు
వీరభద్రుండు పెంపొందు విశదకీర్తి. 4

క. ఆ వీరభద్రునకు హితుఁ
డై వెలసినయట్టి పుణ్యుఁ డనవరతంబున్
శైవార్చన సంపన్నుఁడు
భూవినుతుఁడు గన్నమంత్రిపుంగవుఁ డొప్పున్. 5

శా. భారద్వాజ పవిత్రగోత్రుఁడు జగత్ప్రఖ్యాతుఁ డుద్యద్యశః
ప్రారంభుండగు గన్నసైన్యపతి సత్పౌత్రుండు శ్రీయాజ్ఞవ
ల్క్యారూఢాన్వయ దీపకుం డయిన విస్సామాత్యపుత్రుండు, వి
ద్యారాజీవభవుండు గన్నయమహాదారుండు ధీరుండిలన్. 6

ఉ. నిత్యయశోవిశాలుఁడును నీతియుగంధరుఁ డద్రిధీరుఁ డా
దిత్యసమానతేజుఁడు సుధీనుతుఁ డున్నత ధర్మశీలుఁడున్
సత్య వివేక భూరిగుణసాంద్రుఁడు పిల్లలమర్రిగన్ననా
మాత్యుఁడు చెప్పనొప్పు మహిమన్విలసిల్లుచు నెల్లదిక్కులన్. 7

వ. అమ్మంత్రిశేఖరుం డొక్కనాఁడు వివిధశైవాగమ పురాణేతిహాస
కథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుఁ బ్రమోదంబున. 8

క. అనుపమచరితుఁ బరాశర
మునిగోత్రజు నన్నుగుంట ముక్కుల నిలయున్
ఘనుని నహోబల మంత్రిం
ద్రుని నందనుఁ దిమ్మనార్యు నుతగాంభీర్యున్. 9

క. రప్పించి సమ్మదము మదిఁ
జిప్పిల ధనకనకరత్నచేలములఁ బ్రియం
బొప్పార నొసఁగి నాతో
నప్పుడు గంభీరఫణితి నతఁడిట్లనియెన్. 10

ఉ. నీవు మహానుభావుఁడవు నిర్మలబుద్ధి జగద్ధితంబుగా
శైవపురాణ సంహితల సారము సర్వము సంగ్రహించి ధా
త్రీ విదితంబుగాఁగ నొనరింపుము పెంపున నాకు నంకితం
బై విలసిల్ల నొక్కకృతి యార్యులకెల్లను సమ్మతంబుగన్. 11

వ. అది శైవాచార సంగ్రహంబను పేరఁ బ్రసిద్ధంబుగా వెలయవలయు
నని బహుమానపూర్వకంబుగాఁ గర్పూర సహితంబుగాఁ దాం
బూలం బొసంగిన నంగీకరించి. 12

క. ఆశాపాశ విముక్తున
కాశావిదితునకుఁ బండితారాధ్య మహా
దేశిక శిష్యునకును వా
రాశి గభీరునకు సుగుణ రమణీయునకున్. 13

క. వీరాంబా నందనునకు
ధీరునకు వివేకనిధికి ధీమంతునకున్
సారోదార కళానిధి
కారూఢ శివార్చనా మహోత్సుకునకున్. 14

క. అహిమకర విపుల తేజున
కహికంకణ సక్తమానసాంభోజునకున్
మహనీయధృతికి సుమతికి
మహిమోపేంద్రునకు గన్నమంత్రీంద్రునకున్. 15

వ. అనుపమజ్ఞానాభివృద్ధియు, నభిమతార్థసిద్ధియుఁగా నా యొనర్పం
బూనిన శైవాచార సంగ్రహంబను కృతికిఁ బ్రస్తావం బెట్టెదనిన. 16

చ. ఇహపర సౌఖ్యహేతువగు నీశ్వరపూజయొనర్పఁగాఁదగున్
మహితవిభూతి నిద్ధరణిమండలిఁగల్గిన భక్తకోటికిన్
విహితముగాఁగఁ దత్క్రియల విశ్రుతభంగు లెఱుంగఁజెప్పెదన్
బహుళ పురాణశాస్త్ర పరిపాటి ధ్రువంబగు పూర్వసమ్మతిన్. 17

గీ. నరుఁడు పుణ్యోదకముల సుస్నాతుఁడగుచు
నియమములు దీర్చి యత్యంత నియతుఁడగుచు
శంభుపూజాస్థలంబు నిశ్చలతఁ జేరి
ధరణి మంత్రితజల పవిత్రంబుఁ జేసి. 18

వ. ఆసన భేదంబులు వివరించెద. 19

సీ. జ్ఞానసంసిద్ధి కృష్ణాజినంబునఁగల్గు
వ్యాఘ్రచర్మమున మోక్షార్థసిద్ధి
యాభిచారికసిద్ధి యసితకంబళమున
నరుణ కంబళము వశ్యప్రదంబు
తెల్లకంబళము శాంతిదము మోక్షదమును
జిత్రకంబళ మిష్టసిద్ధినిచ్చు
స్తంభనకరము పీతచ్ఛాయ కంబళి
పౌష్టికంబుల మేలు పట్టుచదర

తే. పౌష్టికములందు వశ్యప్రపంచములను
దర్భపీఠంబు లెస్స శుద్ధస్థలమున
వీనిలో నాసనంబు గావించి యొకటి
యొప్పుగా భూతి చల్లి కూర్చుండవలయు. 20

వ. మఱియు వైణికాసనంబున దారిద్ర్యంబును, దారుకాసనంబున దౌర్భాగ్యంబును, ధరణీతలంబున దుఃఖప్రాప్తియుఁ, బాషాణంబున రోగోత్పత్తియుఁ, దృణాసనంబునఁ గీర్తిహానియుఁ, బల్లవాసనంబునఁ జిత్తవిభ్రమంబును నగుంగావున వీని వర్జించునది. 21

వ. మఱియు విభూతిధారణంబు సేయునది తత్క్రమం బెట్టిదనిన.

క. శుభములకు మూలమై జగ
దభినుత సౌభాగ్యలక్ష్మి కావాసంబై
యభినవ మహిమల కిరవగు
విభూతి మహాత్మ్యమింత వివరింతుఁ దగన్. 22

చ. పలికె భవాని శంభునికిఁ బ్రాంజలియై భవుభక్తిఁ జూచినన్
దలఁచిన ముట్టినన్ వినినఁ దాల్చినఁ సిద్ధిఘటింపఁజాలు న
త్యలఘు విభూతి లోకముల కద్భుత లీలల నే పదార్థ మ
గ్గలము శుభప్రదంబు పలుకందగు దాని దయాపయోనిధీ. 23

చ. అనవుడు శంకరుండు జగదంబకు నిట్లను మంగళార్థమున్
ఘనతర సిద్ధిహేతువును గావుననుజ్జ్వల భూషణంబుగా
మునుదయచేసితిన్ భసితమున్భువనంబుల కవ్విభూతిఁ బెం
పును దురితక్షయంబునగుఁ బుణ్యమునబ్బు వశిత్వసిద్ధితో. 24

వ. అదియును నైశ్వర్యకరంబున విభూతియు, భాసనంబున భసితం
బును, సమస్త పాపభంజనంబున భస్మంబును, ఆపత్సంరక్షణంబున
క్షారంబును భూతప్రేత పిశాచ బ్రహ్మరాక్షసాపస్మార గ్రహచోర
సర్ప వ్యాఘ్రాది రక్షణంబున రక్షయు నన నేను తెఱంగులయ్యె.
తదుత్పత్తి ప్రకారంబు వివరించెద. 25

సీ. కపిలవర్ణముగోవు కడునొప్పు నందనా
జనియించెఁ దద్గర్భమున విభూతి
నల్లని మొదవు వర్ణనకెక్కు భద్రనాఁ
దద్గర్భమున భసితంబు పుట్టె
నెఱ్ఱని ధేనువు నేపారు సురభినాఁ
గలిగె భస్మంబు తద్గర్భమునను
బొగచాయ గలయావు పోలు సుశీలనా
క్షారంబు వొడమెఁ దద్గర్భసరణి

తే. చిత్ర వర్ణియుల రుచిర సిద్ధిదాల్చు
నిట్టి సుమనోభిధాన మంగీకరించి
ప్రభవమొందెఁ దదీయగర్భమునరక్ష
సంచలములేక యిట్లుద్భవించె భూతి. 26

వ. సద్యోజాతముఖంబున విభూతియు, వామదేవ వదనంబున భసితంబును, అఘోరవదనంబున భస్మంబును, తత్పురుషాననంబున క్షారంబును, ఈశాన వక్త్రంబున రక్షయు నుదయించుటఁ జేసి తద్వక్త్ర క్రమంబున భూతిధరించు పురుషుండు రుద్రుండగు సందేహము లేదు. నిత్యకార్యంబులందు విభూతియు, నైమిత్తిక క్రియల యందు భసితంబును, ప్రాయశ్చిత్త కరణంబులయందు భస్మంబును, మోక్షకర్మంబులయందు క్షారంబును, భయరక్షా ప్రయోగములయందు రక్షయు ధరియించునది. గ్రంథాంతరంబునఁ జెప్పిన తెఱంగున భస్మంబు శైవంబగు తేజోరూపంబని మానవీయ సంహితంబలుకు. మఱియు జాబాలోపనిషత్తున నొడివిన విధంబు వివరించెద. 27

గీ. వసుధ పొడమె సద్యోజాత వక్త్రమందు;
నుర్వింబుట్టెనివృత్తి; యందుద్భవించెఁ
గపిలధేనువు నందనాఁ; గలిగె దాని
గోమయమున విభూతి యక్షుద్రమహిమ. 28

గీ. వామదేవాననంబున వారితత్వ
మందునుఁ బ్రతిష్ఠ దానభద్రాఖ్యఁదనరు
కృష్ణవర్ణము ధేను వాగోమయంబు
నందు భసితంబు క్రమమున నంకురించె. 29

క. జనియించె నఘోరముఖం
బున నసలంబందు విద్య పుట్టఁగలిగె దా
[నను రక్తవర్ణ] సురభియు
నన, భస్మము దాని గోమయంబునఁ బొడమెన్. 30

కం. తత్పురుషముఖజ మనిలము
తత్పుత్త్రిక శాంతి ; మొదవు ధవళచ్ఛవి నం
దుత్పాదిల్లె సుశీల ; జ
గత్పావని పేడవలన క్షారము గలిగెన్. 31

గీ. కలిగె నీశానముఖమున గగన; మందు
శాంత్యతీతాఖ్య జనియించె శంభు మేన
నంద చిత్రాంగి సుమనస్సమాఖ్య మొదవు;
సముదితంబయ్యెఁ దద్గోమయమున రక్ష. 32

వ. మఱియు విభూత్యాది పంచకంబునకు రుద్రాంగత్వంబు వివరించెద. అగ్నిమండలంబు నడుమ నగ్నిజ్వాలా వృతుండును, గళదశక యుక్తుండును, శక్తి స్వస్తికాది రుచిరహస్తుండును నగు రుద్రునిం దలఁచి తద్వహ్నియందు విభూత్యాదులు సంపాదించెదనని సంకల్పంబు సేయునది. మఱి గోవుల లక్షణంబు వివరించెద. వికటాంగియు వెఱ్ఱియుబహుళనియు దుష్టను అలసయు శివ చిహ్నాలు లేనిదియుఁ బుసద్ధేనువు కృశించినదియుఁ బాలు లేనిదియు నింద్రియరహితయుఁ గసవు మేయనిదియును వెంద్రుకలును కార్పాస వస్త్రశకలని చయంబు భక్షించునదియును ఈచుకొన్నదియు నవప్రసూతియు రోగిణియునైన గోవులగోమయంబు మాని, యప్రశస్తభూమి పతితంబును దుర్గంధయుక్తంబును బ్రాచియునైన గోమయంబు విడిచి, ప్రశస్తంబగు గోమయంబు దెచ్చి యుత్పత్తి స్థితి సంహారభేద గణితంబులుగా సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రంబులు పంచప్రణవ పంచబీజ పురస్సరంబుగా నుచ్చరింపుచు, గ్రహణంబును బిండీకరణంబును శోషణంబును దహనంబును వస్త్ర శోధనంబును గావించి, విభూత్యాది పంచకంబుత్పాదించి, యశోక బిల్వ చూత దారువులం జేసిన పదిలంపు మంచి బరిణెలంగాని లోహపాత్రలంగాని క్షాళనమార్జనాది శోధన ప్రయత్నంబుల సంగ్రహించునది. మఱియు శైవపురాణంబున వాయువీయ సంహితం జెప్పిన విధం బెఱిఁగించెద. 33

సీ. కపిలధేనువుపేడ గగన మార్గమునందుఁ
బడఁ బాఱి మీఁదనే పట్టవలయుఁ
బడిన, దుర్గంధంబుఁ బర్యుషితంబును
నతికఠినంబును ననుకుఁగాక
యుండంగఁ గ్రిందును నుపరిభాగంబును
బుచ్చి యత్నమునను దెచ్చునదియుఁ,
దద్గోమయంబు ముద్దలుచేసి యెండించి
హరవహ్ని మూలమంత్రాభిహుతము

తే. గానొనర్చి యపక్వంబు గాకయొనరి
పక్వమగునట్టి తెల్లని భస్మమమరఁ
జీర వడిపెట్టి తగిన యా దారుపాత్రఁ
బోయఁదగు మంత్రయుక్తిఁ బ్రస్ఫుటముచేసి. 34

గీ. దారువున నొండె లోహపాత్రమున నొండె
స్ఫటిక శశికాంతముఖ శిలా ప్రతతినొండె
మంటినొండెను వస్త్రచర్మములనొండె
మృదువుగా భస్మపాత్ర నిర్మింపవలయు. 35

వ. మఱియు నలాబు నారికేళముఖ ఫలాదికంబులనైన భస్మధారణంబు నిర్మించి యందుఁ బ్రస్థపరిమితంబగు భసితంబు సంగ్రహించి యామ్య హస్తముననొండె చరమహస్తమున నొండె ధరియించునది. అశుద్ధ స్థలంబున నశుచిహస్తంబునఁబట్టక, నీచాంగ సంస్పర్శంబు సేయక, తదుల్లంఘనంబును దదుపేక్షయు నాచరింపక, మంత్రయుక్తిం బ్రయోగించునది. మఱియు కామికాగమంబున నీశ్వరుం డానతిచ్చిన విధంబు వివరించెద. 36

మ. రమణీయోజ్జ్వల భూతికల్పిత పవిత్రస్నాన మాగ్నేయ మ
క్రమతం దత్కృతి భక్తిముక్తులగు సంస్కార ప్రభేదస్ఫుట
క్రమత న్నాల్గుతెఱంగు లాభసితముం గల్పానుకల్పోపక
ల్పములున్ మూఁడున కల్పకంబుననఁ గల్పంబెక్కుఁడామూటికిన్.

సీ. తెవులేమియును లేక సవరనై దృఢమైన
యంగంబుగల కరియావుదొండెఁ
గపిల ధేనువుదొండె గరగరనైన గో
మయము సద్యోజాత మంత్రయుక్తి
నలిన పత్రంబున నభమునందఁ గ్రహించి
వామదేవమున దుర్వార నియతిఁ
బలుముద్ద చేసి నిర్మలభూతి నెంచించి
యది యఘోరమున రుద్రాగ్నియందు

తే. దహన మొనరింపఁ గల్పంబు తద్విభూతి
వశ్యమగు శుష్కగోమయ వశ్యరజము
పూర్వ పరిపాటి మనుయుక్తముగ దహింపఁ
గల్పతత్త్వజ్ఞులది యనుకల్పమంద్రు ౩౮

క. పాకస్నానము భసితము
కోకను శుచియై పవిత్ర గోమూత్ర కృత
స్వీకృత పిండీకృత పూ
ర్వాకృతి నుపకల్పసంజ్ఞ యగు దగ్ధంబై 39

వ. అమంత్రకంబై యన్యాపాదితంబైన భస్మంబకల్పకంబు. 40

గీ. బ్రాహ్మణక్షత్త్ర వైశ్యవర్ణములవారి
కర్హములు కల్పముఖ్యంబులైన మూఁడు
భస్మములును; నమంత్ర సంపాదితమగు
భూతి యితరులకెల్లను బూయవచ్చు. 41

వ. వీనిలో నొకటి కనకాది పాత్రములయందు సంగ్రహించుకొని
తద్భస్మంబునఁ ద్రిసంధ్యలయందును స్నానము సేయునది.
మఱియుఁ గ్రియాసారంబునఁ జెప్పిన తెఱఁగు. 42

క. ఈలాగు విధికృతంబగు
నా లలితవిభూతిఁ జేయనగు స్నానము ప్ర

క్షాళిత కరచరణుఁడు మో
క్షాళికి[1] నియమమందునై యఖండితభక్తిన్. 43

వ. మఱియు భస్మము ప్రయత్నంబున రేణువులు భూపతనంబు గాకుండ హస్తంబునందు నిలిచి నిర్మలవారి యుక్తంబుగా నెనిమిదిమాఱులు పంచాక్షరంబు లుచ్చరించుచు, శిరస్సునందు నీశానమంత్రంబునను, ఆననంబునఁ దత్పురుష మంత్రంబునను, వక్షంబున నఘోర మంత్రంబునను, గుహ్యంబున వామదేవ మంత్రంబునను, పాదంబుల సద్యోజాత మంత్రంబునను, కరంబులఁ బరిమార్జనంబుచేసి, సర్వాంగములయందు నుద్ధూళనము చేయునది. ఇది యాగ్నేయ స్నానమంత్రము. 44

మ. యతికృత్యంబు విశుద్ధ భస్మకృత భవ్యస్నానమాగ్నేయ సం
జ్ఞితమార్గంబున నెక్కు[3] రంధ్రమున హింసింపక జెడుక జంతువుల్
క్షితినా స్నాపనసంబు ప్రాకృతము భాషింపఁబడక ప్రాకృతా
గతముక బ ధములంచు భస్మపరిషేకం బొప్పు బంధఘ్నమై (?)

వ. అని వాశిష్ఠలైంగ్యంబులంబలుకు. మఱియు శివధర్మోత్తరంబునఁ జెప్పిన తెఱఁగు. 45

శా. వారిస్నానముకంటె నెక్కుడిల దుర్వార ప్రభావాదిక
స్ఫారజ్ఞాన వివర్ధనస్ఫురణ భస్మస్నాన మీరెంటిలో.
సారాంశజ్ఞత సారవారుణజడ స్నానంబు వర్జించి యా
చారార్థం బొనరింపఁగాఁదగు శుభస్నానంబు నాగ్నేయమున్. 47

వ. మఱియు లోకోత్తరంబున. 48

మ. సలిలస్నానము వారుణాఖ్యమున, భస్మస్నానమాగ్నేయమై
చెలువొందు, న్నిలసాతపంబయినవృష్టిన్ దివ్యసంజ్ఞంబు భా
సిలు, వాయవ్యమసంగ గోఖురరజస్సేకంబునన్, బ్రాహ్మమిం
పలరున్ మానస మంత్రయోగమునఁ బ్రఖ్యాతంబు లీస్నానముల్.

1. మోక్షాళిత నియమందు నత్యఖండితభక్తిన్. అని. కా. ప్రతి.
2. ఆక్షేయ. కా. ప్రతి. 3. రధ్రమున కా. ప్రతి.

గీ. దివ్య వారుణాగ్నేయ వాయవ్యములును
బ్రాహ్మమునునను నీస్నాన పంచకంబు
నందు నుత్తమ మనికాదె యాభవుఁడాది
లీల నొనరించె భసిత ముద్ధూళనంబు. 50

క. పరమేష్ఠియు సురలును గి
న్నరులును యతులు మరుద్గణంబులు మునులున్
గరుడ పితృ భూతముఖ్యులు
పొరిపొరిఁ బూయుదురు స్నానమున భస్మమ్మున్. 51

క. కావున భస్మస్నానము
శైవముఁ బోల్పంగ లేదు; సంహృతభవపా
శావలియై నరుఁడుండును
బావన శివలోకసౌఖ్య భరితుండగుచున్. 52

మ. సమదేభంబుల సహ్యాసింహతను సంస్పర్శన్మృతిన్ బోదు చం
దమునం గ్రాఁగు గ్రహంబులున్ కుటిలభూతప్రేత సంఘాతమున్
భ్రమదాహజ్వర గుల్మరోగ పవనాపస్మార కుష్ఠాది రో
గములున్ దుష్టభయంబులున్ భసిత సేవంబొప్పఁ గావించినన్. 53

గీ. శ్రుతి నకార్య-సహస్రంబుఁ జేసియైన
యత్నమున భస్మమునఁ దానమాడు నెవ్వఁ
డతని తత్సర్వ కలుషంబు లపహరించు
ఘోరమనలంబు వనములు గాల్చుభంగి. 54

వ. అనుచు లైంగ్యంబునను స్కాందంబునను బలుకు. మఱియు శివ
ధర్మోత్తరంబునఁ జెప్పిన తెఱంగు. 55

క. నయమేది నరుఁడు క్రూరత
భయద మహాపాత కోప పాతకయుక్తుం
డయినను భస్మస్నానము
నియతిం బొనరించి వాని నిరసించుఁదుదిన్. 56

క. నియత స్నానము విజితేం
ద్రియుఁడై భస్మమున నాచరించిన నరుఁడెం
తియు మహిమ నేకవింశా
న్వయయుతుఁడై పరమపదమునను వర్తించున్. 57

క. ధర యోగి త్రిసంధ్యల నా
చరణతల శిరస్కమైన సర్వాంగమునన్
వరభస్మమూడినను సు
స్థిరముగ వేగంబె యోగ సిద్ధింబడయున్. 58

వ. మఱియు భీమాగ మోత్తరంబున. 59

గీ. ధర్మ మెయ్యది సకల తీర్థములునాడ
నెన్ని యజ్ఞంబులును జేయ నేమిఫలము
కోటిగుణితంబు దాని కెక్కుడుగఁ బడయు
మహిమ మనుజుండు ఫలము భస్మమునఁదోఁగి. 60

వ. మఱియు భస్మస్నానంబున విశుద్ధాత్ముండును జితేంద్రియుండును జితక్రోధుండును నై పురుషుండు మత్సమీపంబునకువచ్చి పునరావృత్తి లేకయుండునని శివుఁడు లింగపురాణమునను బలుకు. మఱియు భస్మస్నానమునకు నుత్కృష్టంబును బవిత్రంబు నగు స్నానంబు లేదని సురలకుం జెప్పి శివుండు తాను భస్మస్నానంబు చేసెనని స్కాందపురాణంబునఁ బలుకు. మఱియు భస్మస్నానంబును బంచాక్షర జపంబును లింగార్చనంబును నగు నీ మూఁడును బరిత్యజింపక యాచరించునదియని గరుడపురాణంబునఁ బలుకును. ప్రణవపూర్వకంబగు పంచాక్షరంబున భస్మోద్ధూళనంబును, మధ్యమానామికాంగుష్ఠంబున భస్మత్రిపుండ్రంబును భక్తినిత్యంబును నాచరించునదియని వాశిష్ఠ లైంగ్యంబులం బలుకును. మఱియు భూతిధారణ స్థానంబులు వివరించెద. 61

సీ. శిరము లలాటంబుఁ జెవులుఁ జక్షుస్సులు
నాసికాభాగ మాననము గళము
భుజ శిరస్సులు భుజంబులును మోచేతులు
మణికట్లు హృదయపద్మంబు నాభి

గుహ్యప్రదేశంబు గుద మూరుయుగమును
జాను ద్వితయమును జంఘయుగళి
గుల్ఫదేశంబు లంఘ్రులు రెండు వీపును
బరికింప నివియు ముప్పదియు రెండు

తే. స్థానకంబు లిచ్చోటను సంతతంబు
భూతి ధరియించుచునదియని భువనహితము
గాఁగ వివరించె శైవదీక్షా విచిత్ర
ధన్యచారిత్రసుప్రభేదంబునందు. 62

క. రుద్ర ధ్యానము గల భ
స్మద్రవ లిప్తాంగకుండు సతత విముక్తుం
డుద్రిక్త క్షయ కుష్ఠా
దిద్రవనిష్ఠాంగుఁడైనఁ దేజస్వియగున్. 63

వ. అని గ్రంథాంతరంబునఁ బలుకు. 64

గీ. శివుఁడు విష్ణువు బ్రహ్మ వాసవుఁడు మొదలు
దిక్పతులు సురల్ తక్కిన దేవయోను
లంబికా రమా వాఙ్మాతృకాది సతులు
భూతిఁ దాల్తు రాలేపత్రిపుండ్రకముల. 65

క. భసిత త్రిపుండ్రకమ్మును
భసితోద్ధూళనము నెట్టిపట్టున మోక్ష
వ్యసనుఁడు విడువఁగఁ జనదని
సుసమాహిత వాక్యభంగి శ్రుతులుఁజాటున్. 66

మ. జనలోకస్థిరకీర్తనం గలితభస్మచ్ఛన్న సర్వాంగుఁ దా
ననువర్తించు నమస్కరించు నుతిసేయం జొచ్చు సద్భక్తి మైఁ
గని యెవ్వాఁడతఁడచ్యుతావహ మహాఘస్తోమసంయుక్తుఁడై
నను శుద్ధుండగుఁ దత్క్షణంబయని కానంబల్కు స్కాందంబునన్.

వ. మఱియు రుద్రాక్ష మాహాత్మ్యంబు వివరించెద. 68

సీ. పూర్వకాలమున శంభునిఁ గుమారస్వామి
  తనర రుద్రాక్ష సంజనన విధము
నవి ధరింపఁగనైన యతిశయ ఫలమును
  నడిగిన నద్దేవుఁ డనియె నిట్లు
మును పురత్రయము నిర్మూల దహించుటకునై
  నిశ్చలదృష్టి నే నిల్చుటయును
అక్షికోణంబుల నశ్రుబిందులు జాఱి
  భూమిపై నొలుకు నంబువులవలనఁ

తే. బుట్టె రుద్రాక్షజాతులద్భుతముగాఁగ
వాని నేమంబు చేకొన్నవారికబ్బు
భక్తిగోవుల వేయింటిఁ బాత్రులకును
దానమిచ్చినఁ బెంపొందు తత్ఫలంబు. 69

వ. మఱియు దర్శన స్పర్శనంబులఁ దద్ద్విగుణ త్రిగుణ ఫలంబు. తద్ధారణ క్రమంబు సమంత్రకంబుగా వివరించెద. భస్మస్నానంబును త్రిపుండ్ర ధారణంబును జేసి శిఖను నేకముఖంబగు రుద్రాక్షం బొకటి శ్రీ సదాశివాయనమః యనియును, శిరంబున రెండు మూఁడు ద్వాదశ ముఖంబులవి మూఁడు వహ్ని సూర్యసోమాది నేత్రాయనమః యనియును, మూర్ధంబున నేకాదశ ముఖంబులవి ముప్పదియాఱు షట్త్రింశ త్తత్త్వాత్మకాయ పరమశివాయనమః యనియును, వామ దక్షిణ కర్ణంబులఁ బంచదశ సప్తముఖంబు లవి యొక్కొక్కటి శ్రీసోమశేఖరాయనమః యనియును, కంఠంబున నారు నెనిమిదియునగు ముఖంబులవి ముప్పదిరెండు త్రియంబక కళాత్మనే శ్రీ కంఠాయనమః యనియును, వక్షస్థలంబున జతుర్ముఖంబులవి యేఁబదింటం జేసిన మాలిక శ్రీ కంఠాది మూర్త్యాత్మకాయ శ్రీ సర్వజ్ఞాయ నమః యనియును, వామబాహువున త్రయోదశంబులవి పదియాఱు-పదియాఱు సుఖాసనాది షోడశ మూర్త్యాత్మకాయ శ్రీ కంఠాయ నమః యనియును, కుడిబాహువున శ్రీ సోమకళాత్మకాయ శ్రీ సోమనాథాయనమః యనియును, వామబాహుమణిబంధంబున నవవక్త్రంబులవి పండ్రెండు పండ్రెండు క్రమంబున ద్వాదశాదిత్యాధిపతయే శ్రీ మహాదేవాయ

నమః యనియును, దక్షిణబాహుమణిబంధంబునను గేశవాది
మూర్త్యధిపతయే శ్రీ ఉమాపతయేనమః యనియును వామ
భాగంబున నుపవీతంబుగాఁ జతుర్దశ వక్త్రంబులవి యష్టోత్తర
శతంబు శతరుద్ర విద్యాత్మకాయ శ్రీ విశ్వేశ్వరాయనమః యని
యును ధరించునదియని శివుండు కుమారునకుం జెప్పెనని కాత్యా
యనశాఖం జెప్పఁబడును. మఱియు విద్యాగమ బున. 70

క. స్థానద్వాదశక బున
సేనరుఁ డిన్నూట యెనుబదెనిమిది రుద్రా
క్షానీకము ధరియించును
నానరుఁ డభవుండు సందియము లేదెంమన్. 71

వ. మఱియు రుద్రాక్షజననంబు స్కాందంబునఁ బలికిన విధంబు. 72

గీ. చంద్రశేఖరలోచనమునఁ బండ్రెండు, సింపు
దృష్టిఁ బదియాఱు, మూఁడవ దృక్కువలనఁ
బదియు రుద్రాక్షజాతులుద్భవమునొందెఁ
గపిల సిత కృష్ణ దీప్తి సంగతములగుచు. 73

క. రుద్రాక్షతరులపైన
క్షుద్రగతిం బొరయుగాలి సోఁకినమాత్రన్
రుద్రునిచేరువ నొందెడి
భద్రస్థితి సంభవించుఁ బ్రాణులకెల్లన్. 74

వ. అని గరుడపురాణంబు పలుకు. మఱియు రుద్రాక్షధారణఫలంబు
తారతమ్యంబులు వివరించెద. 75

సీ. ఏకముఖంబిచ్చు నెల్లసిద్ధులు, రెండు
మొగములయవి భుక్తి ముక్తిదములు
మూఁడుఁ బండ్రెండు మోములవిచ్చుభోగంబు
నైదు నాఱును నేడు నాస్యములవి
జ్ఞానమోక్షదము, లష్టముఖంబులవి భీతి
నపనయించుఁ, ద్రయోదశాస్యములవి

యగుశాంతిదంబులు, నవవక్త్రములురక్ష,
దశచతుర్ముఖములు తరతరంబు

తే. భుక్తిముక్తులు శాంతిని బుష్టినొసఁగు,
వరుసఁ బదునాల్గు ముఖములఁ బరఁగునవియు
శివదృఢజ్ఞాన నిఖిలార్థ సిద్ధులిచ్చుఁ
బ్రోక్త పదముల రుద్రాక్షములు ధరింప. 76

వ. మఱి మోక్షపద శిఖాధారణంబునఁ గోటిఫలంబును, గర్ణంబులఁ బదికోట్లును, గంఠంబునఁ గోటిశతంబును, మూర్ధంబునఁ గోటి సహస్రంబును, నుపవీతంబునఁ బదివేలకోట్లును, భుజద్వయంబుల లక్షకోట్లును, హస్తంబుల నమేయ ఫలంబును, రుద్రాక్ష ధారణంబునఁ గలుగు. మఱి నాభిదిగువ యంగంబుల ధరియింపఁగాదు. లింగధారణంబును రుద్రాక్షధారణంబును నొక్కసమంబయని స్కాందంబునఁ జెప్పఁబడెను. 77

క. రుద్రాక్ష దొఱకకున్నను
రుద్రాక్షను మంటిదైన రోయకదాల్పన్
విద్రుత దుష్కృతుఁ డగుచును
రుద్రునిలోకంబు వడయు రూఢి దలిర్పన్. 78

వ. అని వామన పురాణంబునఁ బలుకు. ఇట్లు రుద్రాక్షధారణంబుచేసి శివపూజకు సంకల్పించి తత్పూజాస్థలంబున సమ్మార్జనానులేపనంబుల విశోధించునది. తత్ఫలం బెట్టిదనిన. 79

గీ. సదమలంబగు శంభుపూజాస్థలంబు
నరుఁడు దృఢభక్తి సమ్మార్జనంబుసేయ
గణన కెక్కని తద్రజః కణములెన్ని
యన్ని వేలేండ్లు వసియించు నభవుపురిని. 80

గీ. మహిత గంధంబుతోడ గోమయముఁగలిపి
హింసలేకండ జలముల నెలమి మిగుల
నభవు పూజాస్థలంబర్థి నలికిరేని
నబ్ధ చాంద్రాయణ ఫలంబులందు జనుఁడు. 81

వ. మఱి రంగవల్లీ లక్షణంబును దత్ఫలంబును వివరించెద. 82

సీ. మౌక్తికాదిక రత్నమయ చూర్ణములనొండె
రజత సువర్ణ చూర్ణములనొండె
శాలి పిష్టాది కౌషధి చూర్ణములనొండె
రమ్యతరంబుగా రంగవల్లి
శంఖాంకుశచ్ఛత్ర చామర స్వస్తిక
సర్వతోభద్రాబ్జ శకటములును
కల్పలతాందోళికా పతాకా పూర్ణ
కలశ తోరణవాజి గజరథములు

తే. నాగబంధ సింహాసన నాగవల్లి
చంద్ర భాస్కరమండల షట్త్రికాష్ట
పంచకోణ చతుర్దశ పద్మబంధ
ములును మొదలుగ రచియింపవలయు వెలయ. 83

వ. ఇట్లు శంభునకుఁ బంచమూర్తులగు శుక్లకృష్ణరక్త శ్యామపీత వర్ణంబులగు ముగ్గులుగూర్చి రంగవల్లి యీశ్వరునకు సమర్పించునది.

గీ. మఖము లోకకోటి యొనరించి మహితతీర్థ
కోటి సేవించి వ్రతములు కోటి సలిపి
పదియువేలేండ్లు పంచాగ్ని పరతఁ దపము
సేయు ఫలమబ్బు ముగ్గులు శివునకిడిన. 84

వ. అని గ్రంథాంతరంబునఁ బార్వతికిఁ బరమేశ్వరుఁడు చెప్పినవిధంబు. మఱియు శివునకు నర్ఘ్యపాద్యాదులు సమర్పించుచు తత్పాత్ర గోకర్ణాకారంబుగా సువర్ణాది లోహంబుల రచియించి యందు గంధపుష్పాక్షత యుక్తంబులగు నిర్మలజలంబుల నర్ఘ్యపాద్యాదులు సమర్పించి, తదనంతరంబ యభిషేకం బొనరించునది. తత్క్రమం బెట్టిదనిన. 85

క. అభిషేకమునకు నదినీ
రభినుతము, తటాకవారి యగుమధ్యమ, మీ

యుభయంబునకును గూడ
ప్రభవములగు జలములెన్నఁబడుఁ దక్కువయై. 86

క. పంకక్రిమి కీటాదిక
సంకలితముగాక విగతశైవాల కలం
కాంకురమగు శుభవారిని
శంకరునకు మజ్జనంబు చనుఁ జేయంగన్. 87

క. పంచాక్షరి పఠియింపుచుఁ
బంచాననుఁ డిందుమౌళి భావమెలర్పన్
బంచామృతముల మజ్జన
మంచితగతి నాచరించి యటుతరువాతన్. 88

వ. గోధూమ ముద్గ హరిద్రాది చూర్ణంబుల నుద్వర్తనంబుచేసి నులివేడి జలంబుల, గంధతోయంబులను, బుష్పసలిలంబులను, హిమవారిని, రత్నాంబువులఁ గ్రమంబున మంత్రపూతంబుగా నభిషేకించునది. తత్ఫలంబు నందికేశ్వరుండు సనత్కుమారునకుం జెప్పిన తెఱంగు, 89

సీ. శివునాదిదేవుని శీతతోయంబుల
గోరువెచ్చైన గోక్షీరములను
బెరుగున నేతఁ బొంపిరివోనిభక్తితో
నభిషేకమొనరించి యభినుతింప
నశ్వమేధముల సహస్రంబు ఫలమొందుఁ
బంచామృతంబులఁ బ్రమథనాథు
మఱియు నీశానాది మంత్రపంచకమున
స్నపనంబుచేసి యక్షయముగాఁగ

తే. నాయురభివృద్ధిఁగాంచు గవాయుతంబు
నవనిసురులకు నర్పించు నట్టిఫలము
నరుఁడు క్షీరాభిషేకంబు నాచరించి
నిఖిల పాపంబులనుద్రుంచు నేతఁబూన్చి 90

వ. తదనంతరంబ వివిధవస్త్రప పీతాభరణములు సమర్పించి మేలగు గంధంబులు సమర్పించవలయు. తత్క్రమం బెట్టిదనిన. 91

గీ. గ్రంథితగరంబు నగరును గప్పురంబుఁ
గోష్టువును మలయజమును గుంకుమంబు
వట్టివేళ్ళును జీఁకటిచెట్టునను
నవని విలసిల్లు శైవగంధాష్టకంబు. 92

వ. అని శారదా తిలకంబునఁ జెప్పంబడు. 93

సీ. గౌరీపతికి బిల్వగంధ మర్పించిన
నైశ్వర్య మోక్షంబు లందుచుండు
దర్పకారికి దేవదారు గంధంబిడి
హరపురినుండుఁ గల్పాంతములను
చంద్రమౌళికి రక్తచందనంబర్పించి
పొందును జనుఁడు సాయుజ్యపదము
ఫాలాక్షునకు భక్తినోల గంధముఁబూసి
పడయు మృత్యువుగెల్చి ప్రమథపదము

తే. గంధసారంబు నగరును గప్పురంబుఁ
గుంకుమంబును మేదించి శంకరునకు
నొసఁగి శివలోకసౌఖ్యంబు లొందుమనుజుఁ
డని క్రియాసారమునుఁబల్కు నధికముగను. 94

క. అక్షతములైన సితశా
ల్యక్షతములు శివునకొసఁగి యనురక్తినరుం
డక్షయ మహిమాన్వితుఁడై
యక్షయ శివలోకసౌఖ్య మందుచునుండున్. 95

గీ. భూతనాథునకును రక్తపీత శుక్ల
కపిల కృష్ణంబులగు వర్ణకముల తిలలు
నర్పణముచేసిరేని సహస్రవృద్ధి
యొక్కటొకటికి ఫలము చేకూరు వరుస 96

చ. వనధిగభీర, ధీర, కులవర్ధన, నిశ్చలపుణ్యశీల, భూ
వినుతగుణాభిరామ, నయవిశ్రుత, శాశ్వత కీర్తిలోల, స
జ్జన పరిరక్షణక్షమ విచారవిభూషణ, సత్యవాక్యపా
లన, విభవాలవాల, శుభలక్షణ, లక్ష్మ్యకృపాపరీక్షణా! 97

క. సంతత వితరణ నిర్జిత
సంతాన, నిరూఢసప్తసంతాన, దృఢ
స్వాంత, పరిశీలితాఖిల
కాంతకళాసాంత, దాంత, కాంతిజయంతా! 98

మాలిని.

సరసగుణవిధేయా, సారవిద్యాసహాయా,
పరమ నియమయుక్తా, భర్గపూజానురక్తా,
నిరుపమగుణసంగా, నిత్యపూర్ణాంతరంగా,
పరిచిత సదుపజ్ఞా, పాలితాత్మప్రతిజ్ఞా! 99

గద్య.

ఇది శ్రీ దుర్గాంబికా ప్రసాదాసాదిత కవితా విలాస భాసుర శ్రీమదహోబలామాత్యపుత్ర సుకవిజనమిత్ర సకల విద్యా నిధాన తిరుమల నాథాభిధాన ప్రణీతంబైన శైవాచార సంగ్రహంబను కృతి యందు ఆసనభేదంబును, విభూతి మహత్త్వంబును రుద్రాక్షజనన ధారణంబులును, సమ్మార్జనాను లేపన ఫల విశేషంబును, రంగవల్లీ లక్షణంబును, అర్ఘ్యపాద్యాది క్రమంబును, అభిషేక విధానంబును, వస్త్రోపవీతాభరణ సమర్పణఫలంబులును, చందనాది గంధంబుల ఫల తారతమ్యంబులును, వివిధ తిలాక్షత ఫల వివరణంబును నన్నది ప్రథమాశ్వాసము.

---

# శైవాచారసంగ్రహము

## ద్వితీయాశ్వాసము

---

శ్రీపార్వతీశ దివ్య
శ్రీపాదాంభోజ నిత్యసేవా నియమా,
శ్రీపరివర్ధిత విపులయ
శా, పిల్లలమఱ్ఱి గన్నసైన్యాధీశా! 1

క. శివపూజకు సర్వాములై
భువి నెన్నఁగఁ బడినయట్టి పువ్వులుఁ బత్ర
ప్రవరములు వరుసఁజెప్పెదు
వివిధ పురాణోక్తసరణి వివరించి తగన్. 2

గీ. మొదలఁ గాలోత్తరమున షణ్ముఖునకభవుఁ
డానతిచ్చిన సరణి నుదాహరింతు;
నేకపుష్పంబు శివునియందిడినఫలము
సాధకులు మెచ్చ మునిలోక సంతసముగ. 3

క. సురుచిర గుణశీల తపో
భరితుఁడు నిగమాంతవిదుఁడు పాత్రుఁడునగు భూ
సురునకిడు కోటిహాటక
గురుఫలము శివార్పితైక కుసుమముననగున్. 4

గీ. పాత్రులకుఁ గోటికన్యల భద్రదంతి
వర్య సాహస్రములనిచ్చి వాజపేయ
శతము లొనరించు నరుఁ డే సుకృతమునొందు
నాఫలముగల్గు నొకపువ్వు నభవుకిడిన. 5

క. పశుపతికి నొక్క పూవన
దృశమతి నర్పించిరేని త్రిభువనములఁ ద
ద్వశముగఁ జేర్ప సులభమా
విశేషఫల మింతకంటె వేఱద్ది ధరన్. 6

క. ఆందోళికాది యానము
లందును హర్మ్యంబులందు ననుపమ వనితా
సందీప్త కుచభరంబుల
యందును నరుఁడుండుఁ బుష్పహారునకునిడినన్. 7

మ. సకలానర్ఘ్య మణిప్రపూర్ణమగు నీ సర్వంసహాచక్రమున్
బ్రకట స్వర్ణగిరీంద్రమున్ వరనిధిక్ క్షాత్రద్విజశ్రేణికె
న్నికగా నిచ్చినఁ దత్ఫలంబు నియతిన్ లింగార్పితంబైన య
య్యేకపుష్పంబు ఫలంబుకున్ సరియె వెయ్యోపాలికిందూఁచినన్. 8

గీ. యజ్ఞకోటి సహస్రంబు లధికనిష్ఠ
నరుఁడు చిరకాల మధికయత్నమునఁ జేయు
నే ఫలంబది లింగదత్తైకపుష్ప
ఫలము వెయ్యగుపాలికిఁ బాటిగాదు. 9

క. ఇలలో నగ్నిష్టోమం
బులు వేయును వాజపేయములునూరు సమం
బులుగావు లింగపూజా
ఫలమున నొకపువ్వు కోటి భాగంబునకున్. 10

వ. మఱియు లింగపురాణంబునఁ జెప్పిన విధంబు. 11

క. అవుననగ కోటిగోవుల
నవనీ నిర్జరుల కొసఁగినట్టి ఫలంబుల్
శివలింగార్పిత పుష్ప
ప్రకర సహస్రాంశమునకుఁ బ్రతిగా వెంకున్. 12

క. జలమైనఁ బుష్పమైనను
మలహరునకుఁ బ్రీతి మంత్ర మార్గంబులన

ట్లలవడ నిచ్చిన పురుషుఁడు
కులకోటుల నుద్ధరించు గురుతరమహిమన్. 13

వ. మఱియుఁ బుష్పవిశేషంబులు వానిలోని తారతమ్యములు వివరించెద

సీ. విరవాది రేల గన్నేరు తుమ్మి జిల్లేడు
తామర నందివర్ధనము జాజి
కడి మశోకము పొన్న కలువ మల్లియ ములు-
సంపంగి బకము కాంచనము గోఁగు
చెంగల్వ చెందొగ చేమంతి యుమ్మెత్త
కలిగొట్టు నల్లని కలువ పొగడ
నాగకేసరము కెందామర మోదుగ
కలివె మంకెన దేవకాంచనంబు

తే. వీని పుష్పంబు లెంతయు విశ్రుతములు
పుష్పజాతులలో శంభు పూజసేయ
నని క్రియాసార మనియెడు నాగమమున
భువన హితముగఁ బలికె నా భవుఁడు కరుణ. 15

వ. మఱియు గ్రంథాంతరంబునఁ బల్కినవిధంబు. 16

సీ. మల్లెలు తెల్లదామర పొన్న గోరింట
పారిజాతంబు గన్నేరుపువ్వు
కుందవర్ధనము పెద్దుమ్మడి జిల్లేడు
నందుగు బకసుమబండ్డసరము
సురపొన్న యుమ్మెత్త కొరవి యశోకంబు
చేమంతి జాజి లక్ష్మీవనంబు
తుమ్మియు తెల్లలొద్దుగ దర్భ కింజలు
వ్రాకుడు నందివర్ధనము పొగడ

తే. కపిల యీతెల్ల విరులలోఁ గరముపెద్ద
ములుక కలిగొట్టు గన్నేరు మోదు గగిసె
యెఱ్ఱలొద్దుగుఁ గెందమ్మి యెఱ్ఱగలువ
యాదిగా నెఱ్ఱవిరులలో నభిమతములు. 17

గీ. వ్రాకుడును నేలతాడియు వావిజంబు
నల్లయుమ్మెత్తయును నిత్యమల్లికలును
మఱియు నెఱ్ఱనిపువ్వుల మదనవైరి
నర్చనము సేయనగు నభీష్టార్థసిద్ధి 18

గీ. పసిఁడి యుమ్మెత్త రేల సంపంగి ములుగో
రింటయును గొండగోఁగును దింటెనయును
పూజ్యములు హేమదీప్తుల పువ్వులందు
నయము నల్లని విరులలో నల్లగలువ. 19

వ. మఱియుఁ గాలోత్తరమున. 20

క. తొలిసారి క్రొత్తవై కడు
వలపుగలిగి చీడలేక వాడక ఖండం
బులుగాని ముఖ్యపుష్పం
బులఁ బూజితుఁడై యభీష్టములు శివుఁడిచ్చున్. 21

క. అరయఁగ సుగంధిపువ్వులు
సురపొన్నలు నుత్పలప్రసూనంబులుఁగే
సరములు మోదుగ విరులును
బొరయవు, సంవత్సరాంతమున బ్రాచివగున్. 22

క. కలువలు తొగలును నల్లం
గలువలు సిత నీలరక్త ఘనరుచిగలయా
నలినములు నాగకేసర
ములు పొన్నలు నేనునాళ్ళు పొరయవు ప్రాచిన్. 23

వ. ఇవి ప్రధానపుష్పంబులు. మఱియు వెట్టగలువ మెట్టదామర, క్రేంకణము, పచ్చతేగడ, గుంటకలగర, నేలకలిగొట్టు, ఇరుగుడు, విజయా చతుష్కంబు, చాఁగ, బూరుగు, దేవదారువు, నివి మొదలైన పుష్పంబులు క్రొత్తగాఁదెచ్చి శివునకు నెల్లప్పుడు పూజించునది. 24

క. ధరణిని శశియును రవియుం
దిరముగు కాలమున లేదు నిర్మాల్యతదా
మరకనుచుఁ దత్వసార
స్థిరసంహిత నారదునకు శివుఁడెఱిఁగించెన్. 25

గీ. పసిఁడిపువ్వులు మోదుగు కుసుమములును
దులసి పత్రంబులును బిల్వదళచయములు.
మానుగా శంభులింగంబు మఱియు మఱియుఁ
గడిగి పూజింపఁ దగునని స్కాందమనును. 26

వ. మఱియు మార్కండేయ పురాణంబునఁ జెప్పిన క్రమంబున పుష్పంబుల తారతమ్యము లెఱిఁగించెద. 27

ఉ. గన్నెరుకంటె నెక్కుడిల గ్రచ్చఱ గొజ్జఁగిపువ్వు, దానిమిం
చెన్నలినంబు, దానికి విశేషము లెన్నఁగ నూర్మ్యఱుంగు ల
భ్యొన్నతి జాజియుం బొగడయున్, శతవృద్ధిని దానికంటె, తా
నిన్నిటికంటె బిల్వమటు లెక్కుడుపూవుల కెల్లవానికిన్. 28

వ మఱియు శివధర్మోత్తరంబున నందికేశ్వరుఁడు వివరించిన విధంబుఁ జెప్పెద. 29

సీ. వివరింప జిల్లెడు విరులు వేయిటికంటె
గన్నెరుకుసుమ మగ్గలము మహిమ
గన్నెరు వేయింటికంటె నుత్కృష్టంబు
బిల్వపత్రంబు సంభృతవిభూతిఁ
దర్కింప బిల్వపత్రములు వేయిటికంటె
ననుభావమునఁ బద్మమతిశయంబు
మహిఁబ్రశస్తంబు తామరలు వేయిటికంటెఁ
దెల్లతామరపువ్వుదీర్ణమహిమఁ
తే. పుండరీక సహస్రంపుఁ బుణ్యమహిమ
జరపుఁ జేమంతి తత్సహస్రము జయించు
నెలమి బకపుష్పమదియు, వేయింటిగెల్చు
మృడునిఁబూజింప వాసి యుమ్మెత్తపువ్వు. 30

క. దుత్తూర పుష్పదశశతి
కుత్తమమిల బ్రాఁకుడదియు నొకవేయిటికిన్
బొత్తూను వారిజమనా
యుత్తతఁ జిఱుదుమ్మి తత్సహస్రముఁ గెలుచున్. 31

గీ. ఎక్కుడిలఁ దుమ్మివిరులు వేయింటికంటె
నుత్తరేనట్టి వేయింటి కుత్తమంబు
దర్భవిరి; తత్సహస్రంబు తరము మహిమ
శంకరునిమీఁద నిడనొక్క జమ్మిపువ్వు. 32

వ. మఱి శమీపుష్ప సహస్రంబుకంటె నల్లవానిలి విశేషంబు. కృష్ణ
నిర్గుండి సహస్రంబుకంటె ములుకపువ్వు ప్రశస్తంబు. బృహతీ
సహస్రంబుకంటెఁ దెల్లజిల్లెడు ప్రసూనం బతిశయంబు. శ్వేతార్క
సహస్రంబుకంటెఁ బెద్దతుమ్మి కుసుమం బతిశయంబు. బృహ
ద్ద్రోణి సహస్రంబుకంటె నల్లగల్వ యుత్కృష్టంబు. నీలోత్పల
సహస్రంబుకంటె సువర్ణపుష్పంబు పెద్ద. సువర్ణపుష్పంబుదక్క నీ
చెప్పఁబడ్డ వృక్షసంభవ కుసుమంబు లన్నిటిలోపల భవార్చనా
విధానంబునకు నీలోత్పలం బతి శ్రేష్ఠంబు. 33

గీ. దాసనపుఁబువ్వు మరువంబు దమనకంబుఁ
గడపవిరి పొన్నకుసుమంబు గౌరవమునఁ
దుమ్మివిరిసాటి ములుక పువ్పంబునకును
సరి దలఁప విష్ణుక్రాంతము సారమహిమ. 34

సీ. జిల్లేడు విరజాజి మల్లెజాజులకును
బాటి యుమ్మెత్త సంపంగిగోఁగు
ప్రతియగు విజయ పుష్పము బిల్వపత్రికిఁ
బాగడ కల్గొట్టు నంబుజము తరము
సమము గన్నేరుకు పచ్చయును గొజ్జంగి గోఁగు
కొండగోఁ గగిసె బ్రాఁకుడును జూడఁ
దొగలు చెంగల్వయుఁ దగు నుత్తరేణికి
బకపుష్పసమము కేతకి (?) యుమల్లె

తే. వారిజంబు నశోకంబు వ్యాఘ్రపుష్ప
ముసకు సరి, దానసంబును మొల్లవిరియుఁ
బొన్నలును బెద్దతుమ్మికిఁ బురుడువచ్చు
నాగమస్థితి తారతమ్యములుచూడ. 35

గీ. సమము లుమ్మెత్తపువ్వుకు సారమహిమ
నెన్నిచూడంగ మహిమించియున్న సూర్య
కాంతపుష్పంబు నమలి కూఁకటియు నాగ
కేసరంబును నిదిశాస్త్ర కీలితంబు. 36

గీ. మౌక్తికంబును వజ్రంబు మరకతంబుఁ
బగడయును నీలవైడూర్య పద్మరాగ
పుష్యరాగంబులాదిగాఁ బొల్చుమణులు
నల్లఁ గలువకు ధర సమానంబులండ్రు. 37

క. మొరలి యెఱగోఁగు నేరేఁడు
సిరికతో సరియాడు, గనెరు చెట్టుల పూవుల్
సరిజిల్లెడు పువ్వనకున్
దరమగు మఱి కృష్ణతులసి దళపుష్పంబుల్. 38

క. విరివిగల క్రొత్తకడిమియుఁ
బరువగు మోదుగును బుష్పపటలములోలిం
బొరి సంగ్రహించి గంగా
ధరునిం బూజింపమేలు తత్పూనములన్. 39

చ. వనగలురాజనంబులును జామలు దూసరి గోధుమంబులున్
మినుములు నన్మలుజ్ఞయవలు మించగువీనిఫలాంకురాగ్రముల్,
మునుకొని శంభునిన్ వెదురు మోసులఁ బ్రాలనుపూజసేయున
మ్మనుజుఁడు వొందు కేలకుసుమంబులఁ బూన్చినఁగల్గుఁ బుణ్యముల్.

చ. అనఁటి కణంబు మద్దియగు నవ్విరులుజ్ఞ ధరనాగనందినాఁ
బొనరినపువ్వులుజ్ఞ గుసుమపువ్వులు మామిడి నందివర్ధనం

బును గురువేరు పత్రములపువ్వులు వావిలిపువ్వు తెల్లదిం
టెనకుసుమంబునున్ బరిగణింపఁగ గన్నెరుకున్ సమానముల్. 41

క. పరికింపఁ దెల్లజిల్లెడు
విరి దింటెన దూల సరణి విరులిప్పవిరుల్
సరి యుమ్మెత పువ్వునకున్
దరమగుఁ జాతప్రసూనతతి శివునకిడన్. 42

గీ. జమ్మిపువ్వును గడపపుష్పంబు సమము
సాటి కలిగొట్టుపువ్వును జాదిపువ్వు
విజయ పుష్పంబు గన్నేరు విరికిబృహతి
పువ్వుసరి నాగ సంపంగి పొన్నవిరులు. 43

క. సరితామరకును సంపెఁగ
విరులును మల్లెలును గపిలవిరులును గురువే
ర్విరులును వెలిదామరలకుఁ
దరంబు వెలివారిజంబ తధ్యంబరయన్. 44

వ. మఱియు లింగపురాణంబునందు. 45

ఉ. అంధకవైరిచెప్పెమును నార్యకు లోకవినింద్యముల్ సుదు
ర్గంధము లప్రసిద్ధములు ప్రాచివి వాడిన వస్వకీయముల్
గంధవిహీనముల్ శుచులుగాని వశుద్ధపుఁదావులిట్టి సం
బంధముగల్గునట్టి కుసుమంబులుగావని శంభుపూజకున్. 46

వ. మఱియు శైవపురాణంబునఁ బలికిన తెఱంగు. 47

గీ. భవుని నర్చింపవలయు శోభనముకొఱకు
జనులు శుభపత్ర పుష్పసంచయముచేత
గంధహీనంబులును నుగ్రగంధములును
నింద్యములు నైనయవి శుభనిందితములు. 48

క. పరువైన విరుల నిడఁదగు
హరునకు; హేయంపువిరులు నతియత్నమునన్

బరిసిన విరులును మొగ్గలుఁ
బరిపాకము దప్పినవియుఁ బరివర్జితముల్. 49

గీ. పాలు ముండ్లును గల్గిన పత్రచయము
నీళ్లలోఁగల బహుపత్ర నిచయములును
శంభుపూజకుఁ గావని చాటుచుండు
జనుల కెఱిఁగింపఁగాఁ గ్రియాసారమునను. 50

వ. మఱియు. 51

చ. దళములు పుచ్చినం బరువుదప్పినఁ బక్వము గాకయుండినన్
బొలుపు దొఱంగినన్ దొడిమ పోయినఁ గీటక కేశ రంధ్రస
మ్మిళితములైన చే వదలిమేదినిబడ్డను నీశ్వరార్చనా
కలనకు నట్టిపుష్పములుగావు నిషిద్ధము లెట్టివేళలన్. 52

చ. దళములుగల్గి నాళసహితంబులుఁ గ్రొత్తలునై మనోహరం
బులునగు పక్వపుష్పములఁ బూజయొనర్పఁదగున్ మహేశ్వరున్
చెలువగునట్టి యుమ్మెతయు జిల్లెడుపువ్వును ములుకపువ్వులున్
గలువయు నీరజంబువెలిగా నిటఁజెప్పినవానిలోపలన్. 53

వ. మఱియు లింగపురాణంబునఁ బార్వతీదేవికిఁ బరమేశ్వరుఁ డాన
తిచ్చిన విధంబునఁ బ్రత్యేక పుష్పపూజా ఫలంబుల వివరించెద. 54

సీ. దేవాళిలో మహాదేవుచందంబునఁ
దారలలోన సుధాంశుకరణి
మృగసమూహంబులో మృగరాజుకైవడి
నఖిలౌషధులలోన యవలపగిది
నఖిలపానములలో నమృతంబుచాడ్పునఁ
బరఁగు నంగములలో శిరసుభాతి
నింద్రియంబులలోన హృదయంబురీతిని
విద్యలలో బ్రహ్మ విద్యకరణి

గీ. చెల్లుబడిలోన విరులలో నల్లఁగలువ
విరిప్రధానంబు దానినీశ్వరుని మనుజుఁ
డర్చనముచేసి చంద్రునట్లధికకాంతిఁ
దనరి నిర్మలుఁడై గణత్వము వహించు.

సీ. హరునల్లఁగలువలనర్చించి రవికోటి
రుచితనుఁడై కామరూపియగును
దొగలఁ బూజించి చెందుచు రుద్రలోకంబు
శుద్ధరూప గణప్రసిద్ధి గాంచుఁ
బచ్చని కలువల భజియించిలోక ప
ఖ్యాతుఁడై శూలభృద్గణతఁ దాల్చు
నెఱ్ఱగన్నేరులను హితభక్తి సేవించి
సకలసంపదలు నిష్టములుఁ బడయు

గీ. నిష్టఁ గనకంపుఛాయ గన్నేర్లఁ గొలిచి
యణిమ మొదలగు సిద్ధుల కాస్పదమగు
గిరిశు పురినుండుఁ దెల్లగన్నేరులఁ బూన్చి
నిలుచు మనుజుండు శంభుమందిరమునందు. 56

క. కలిగొట్టు విరులఛాయం
గల గన్నేరు విరుల శంభు ఘనతరభక్తిఁ
గొలిచి ప్రభగలిగి దురితా
వలిఁ దొఱఁగి నరుండు శివునివలె మోదించున్. 57

క. శంకరుని మీఁద మనుజుఁడు
కుంకుమ పట్టెళ్ళుపెట్టి గురుతరమహిమా
లంకృతుఁడై ప్రాపించును
సంకల్పిత సిద్ధుఁడగుచు శంభుపదంబున్. 58

ఉ. గన్నెరుపువ్వు లెక్కుడిలఁగల్గిన విశ్రుతపుష్పజాతులం
దన్నిటికిన్ శివున్నియతి నవ్విరులన్నిటఁ బూజసేయ న
త్యున్నతి సేనువర్ణముల నొప్పగుమంత్రము లుచ్చరించనే
నన్నరుఁడొందు శాశ్వతశివాంచిత లోకవిహారసౌఖ్యముల్. 59

సీ. చేమంతి విరుల నర్చించి శాశ్వతలక్ష్మి
నణిమాది గుణయుక్తుఁడై చెలంగు
నలలిత జ్ఞాన కీర్తులు గల్గి మోదించు
నాదివర్ధనము లున్నతి ఘటించి
పొన్నపుష్పంబులఁ బూజించి దివ్యాబ్ద
ములు నందనారామమున సుఖించు
రేలపువ్వులఁ బూన్చి కాలంబు ధరియించు
శ్వేతుని కరణి నక్షీణశక్తిఁ

గీ. దుమ్మి కుసుమంబులర్పించి సమ్మదమున
నధిగతైశ్వర్యుఁడై యుండు నభవుపురిని
నయుత గోదాన ఫలమంది హరునిఁ జేరు
ములుక పువ్వుల నరుఁ డీశు ముదితుఁ జేసి. 60

వ. మఱియు నరుఁడు తెల్లని యుమ్మెత్తపువ్వుల నొక్కమాఱు లింగార్చనంబుచేసి లక్ష గోవుల దానంబుచేసిన ఫలంబువడసి శివలోక ప్రాప్తుండగు. రక్తవర్ణంబులైన ధుత్తూర పుష్పంబులం బూజించి కోటి గోదాన ఫలంబులఁ బ్రాపించి శంభు భవనంబునకుఁ బోవు. నల్లని ధుత్తూర ప్రసూనంబులఁ బూజించి శతకోటి గోదాన ఫలంబుఁ జెంది యిందుధరునిఁ జేరు. పచ్చని యుమ్మెత్త కుసుమంబు లర్పించి యొక్క న్యర్బుదంబు గోవుల నిచ్చిన ఫలంబుగొని శంకరునిం గదియు. సువర్ణ వర్ణధరంబైన కనక కుసుమ నికాయం బొనఁగి యొక్క మహాఖర్వంబు గోవుల దానంబునఁ గల్గిన ఫలంబు గైకొని మహేశ్వర పదంబునఁ బ్రమోదించు. ప్రభాతంబున నుమ్మెత్తవిరుల లింగార్చనంబుచేసి పదివేల సూర్యుల తేజంబు వడసి శివలోకంబున వసించు. 61

గీ. కణపపువ్వులఁ బూజించి ఘనత మించి
చేరు దేహాంతమున సదాశివుని నరుఁడు
పరమగతినొందు మోదుగు విరులగంధ
జలము చిలికించి భవుని నర్చనముచేసి. 62

క. శ్వేతార్కంబుల శంకరు
నాతతమతిఁ బూజసేయు నానరుఁడు లస
చ్చాతుర్య జ్ఞాన సుఖ
స్వాతంత్ర్యము వడయు జగతి సర్వజ్ఞుండై. 63

గీ. గంధయుక్తంబుగాఁగ నగ్గలపునియతి
శివుని జిల్లేడు విరుల నర్చించి నరుఁడు
కామరూప గణత్వంబు ఘనతఁ దాల్చి
శంభులోకంబునందుండు సారమహిమ. 64

క. [1] పారిజపు (?) విరుల గంధపు
నీరమున విడిల్చి శంభునిం బూన్చి నరుం
డారయ గణాధి పత్య
శ్రీరమ్య విభూతిదాల్చు శివలోకమునన్. 65

సీ. బకపుష్పములు గంధభావితంబులుచేసి
యర్పించి రేనియు నడ్డసరము
పుష్పంబు లిడియును బొన్నగంటెదిచాయ (?)
దూర్వాంకురములతో దొరయుదీప్తి
గలుగు వావిలిసుమంబులు సమర్పించియు
బరిపక్వమగుచుఁ జందిరముచాయ
దనరు కాంచనముఁ బత్రములఁ బుష్పచయంబు
చెల్లించియును మణిచిత్రితంబు
గీ. లగు సువర్ణ ప్రసూనాది కార్చనమున
వఱలు భవుకృప గణపతిత్వమున నరుఁడు
కామరూపగణంబగు గంధవారి
విద్రిచి మల్లియలుం దగు విరులుఁబూన్చి. 66

సీ. నరుఁడు జాజుల మంకెనల సుగంధులఁగొల్చి
యట మహాబలగణంబై వసించుఁ
జపల గణంబగు సంపంగి పుష్పంబు
లను నీరుగోరింటలను భజించి

1 వారిజపు

కురువింద కమ్మక్రొవ్విరుల నర్చనచేసి
యతిముఖ్య గణమున నతిశయిల్లు
దర్భపువ్వులును బత్రములు మొల్లలు గూర్చి
హేమకూట గణాఖ్య నేపుమిగులు

తే. రెల్లు పువ్వుల నడవిలో మొల్లవిరుల
దానసంబులఁ బూజించి తనరుచుండు
యతిగణాఖ్యత శివుకృప నంది మఱియు
శివునిలోకంబునందు సుస్థిర విభూతి. 67

క. బొట్టుగులఁ బొగడపువ్వులు
నిట్టలమగు భక్తి శివునకిడి వకుళాఖ్యన్
నెట్టన చరించు గణమై
గట్టిప్రతాపమున శంభుకడఁ గింకరుఁడై. 68

క. సకల ప్రసూనజాతుల
నకుటిలమగు భక్తి శివుని నర్చించిన యా
సుకృతంబు చేరునెవ్వఁడు
సుకరములగు గోఁగువిరుల సుస్థిరపూజన్. 69

గీ. జాదులుత్తమములు ప్రదోషములయందు
నర్థరాత్రంబు మల్లియ లభినుతములు
కథితములు రాత్రులుమ్మెత్త గణపవిరులు
శివునిఁ బూజింప దివములెల్లవియుమేలు. 70

గీ. యోగ్యములు జాజిపువ్వంబు లొక్కజాము;
గన్నెరులహర్నిశములందుఁ; గలువపిండు
తొగలుఁ బొన్నలు నేనాళ్ళఁ దొంగలించుఁ;
దనరు మోదుగు విరులుఁ బద్మములు నెపుడు. 71

గీ. తాన విరులుగోసి తగనొక్కమఱియైన
శివుని మానవుఁడు భజించెనేని
తత్ప్రసూనపూజ తానె గైకొను నిష్ఠ
కంకటుండు భువన శంకరుండు. 72

చ. ఇలఁ జెలువొందు శాస్త్రముల నెన్నఁగఁ బడ్డవి యెన్ని తోయజ
స్థలజములైన పుష్పములఁ దత్ప్రసంబుల లింగపూజనం
బలవడఁజేయ మెత్తు మఱియన్నిటినిన్ శిరసావహింతు న
త్యలఘువిభూతిభావమున నర్పితముల్ దగఁజేసిరేనియున్. 73

క. ఈవిధముగ నొప్పఁగ న
న్నీవాఁడర్చించుఁ బార్వతీ! యతఁడొందన్
బావనమహిమను శివలో
కావాస విశేషసౌఖ్య మఘుదూరుండై. 74

వ. మఱియు స్కాందపురాణంబునఁ జెప్పినవిధంబు వివరించెద. 75

తరువోజ

ఒక్కొక్క కుసుమమ్ము నొగినీశుకిడఁగ
నేఫలంబని చెప్ప నెల్లశాస్త్రములు
తక్క క సిద్ధించుఁ దత్క్రమంబుగను
దత్ఫలత్రిగుణంబు దండలర్పింప
నొక్కవెయ్యంటి నీలోత్పలంబులను
నొనరు మాల్యము నరుండగ్రున కొసఁగి
చిక్కిన శివపురస్థితిఁ గల్పకోటి
శత సహస్రములుండు శంభుసంబోలె. 76

ఉ. ఆయతభక్తియుక్తిఁ ద్రిపురాంతకు శంకరు నల్లగల్వన్
వేయును నూట నెన్మిదిట విశ్రుతభంగి భజింప మానవుం
డాయుభవంబు తానయయి యద్భుతవైభవ సంపదస్థితిం
బాయక శంభుసన్నిధి నపారసుఖంబుల నొందు నెప్పుడున్. 77

వ. మఱియు శివలింగంబునందు నర్కపుష్ప కల్పితంబులైన మాల్యంబు లిడిన నరుండర్క సమానుండై శివలోకమున కరుగు. గన్నేరు పువ్వులఁ బ్రకల్పితంబులైన దండలిడి శుద్ధసువర్ణసదృశ విగ్రహంబు ధరించి యోగియై భవుపురంబున సుఖించు. ధుత్తూర పుష్పశతంబునఁ బూజించి సదాశివపురంబునఁ బునరావృత్తిలేక నిలుచు. మొల్లల వేయింట నర్చించి శంభు భవనంబునఁ బ్రమోదించు. నీలోత్పల సహస్రంబుల నర్చించునతం డైహికాముష్మిక

శ్రీసమృద్ధుండై రుద్రలోకంబున వసించు. శివనామ సహస్రంబునఁ దామరల వేయిటఁ బూజించి శంకరపదంబుఁ గాంచు. జాతులష్టోత్తర శత సహస్రంబులఁ బూజించి శంభు భవనంబునఁ బ్రమోదించు. మఱి శివధర్మోత్తరంబునఁ జెప్పిన తెఱంగు వివరించెద. 78

గీ. భవునకుమకు సుగంధ పుష్పములతోడ
నవ్యముగ జాజివిరుల మండప మొనర్చి,
విమలపుష్పవిచిత్ర యానములతోడ
శివపురంబున కరుగు మానవుఁడు నియతి. 79

గీ. అర్చనాసక్తి నియమ విన్యాసగతుల
ఫలము విత్తాను సారసంప్రాప్తమగుట
దెలియవలయును శివధర్మ లలితచిత్త
ధుర్యషాండిత్య మహితు లస్తోకమహిమ. 80

వ. మఱియుఁ గ్రియాసారంబునఁ జెప్పినవిధంబు. 81

క. విరిపువ్వులు బత్రంబులఁ
బొరిఁబొరిఁ దన్మంత్రపూర్వముగఁ గట్టి నరుం
డిరవొందు భక్తితోడుత
హరునిం బూజింపఁదగు సదా త్రపౌఢిన్. 82

గీ. పట్టు దేవాంగమగు తంతుపటలి, చీని
పద్మసూత్రంబుఁ గార్పాసఫలజ మరఁటి
చొరువునను గల్గు వీనిలోఁ జులకఁ జూఁచి
విరులు గట్టంగ నుత్తరోత్తర ఫలంబు. 83

వ. మఱియు స్కాందపురాణ భాషితంబు వివరించెద. 84

క. తనపెట్టిన యారామం
బునఁ బుష్పములొండె శైలముల విరులొండెన్
వనజంబులొండె నెందైె
నను దొరకినవొండె శంభునకు నీవలయున్. 85

వ. ఇది పుష్పపూజా విశేషంబు. మఱి శివలింగ పూజనంబునకు విశేషంబులగు పత్ర నిచయంబులును, వాని ఫల తారతమ్యంబులును క్రియాసారంబునఁ జెప్పిన విధంబు వివరించెద. 86

ఉ. మారెడు జమ్మి శ్రీతులసి మామిడిబోడసరంబు దర్భనా
నేరెడు తెల్లగన్నెరు వనీదవనంబును మాదిరేకులు
న్దూరువముల్ కలంజములునుం దవనంబును బచ్చయిందుగున్
వారిజ ముత్తరేను మరువంబును బత్రములందు ముఖ్యముల్. 87

సీ. తపసిపత్రము దర్భ ధాతకిపత్రంబు
పంచబిల్వములు సంపంగిదలము
తులసులు రెండును దూర్వాంకురంబులు
జమ్మిపత్తిరి సరోజదళములును
మారేడు రేకులు నేరెడాకులుఁ బచ్చ
మామిడి చిగురాకు మాచిపత్రి
గుమ్మడి రేఁగు పెగ్గుమ్మడి హరిక్రాంత
కలివె పత్రము నెలుక చెవియాకు

తే. లివియు మొదలైన పత్రంబు లీశ్వరునకు
నర్పితముసేయఁ బుత్ర పౌత్రాభివృద్ధి
యగునటంచును మునికోటికాదరమున
నభవుఁడానతియిచ్చె గ్రంథాంతరమున. 88

క. కురువేరు వట్టివేరును
గుఱియగు మూలములఁ దన్ను గుఱిగొనిపూన్పన్
గఱకంఠుఁ డిచ్చు శుభమని
మఱియును గ్రంథాంతరమున మానుగఁ జెప్పెన్. 89

గీ. కలివెచెట్టు వెలఁగ కపిల వావిలి కొండ
మామిడనఁగఁ దత్సమములు గానఁ
బంచబిల్వములని పల్కె మార్కండేయ
మునివరుండు సర్వమునులతోడ. 90

గీ. పండినవియైన నెండినఁ బ్రాచివైన
బిల్వదళముల శంకరుఁ బ్రియమెలర్ప
నర్చనము సేయ దురితాళి యణఁగుననుచు
నారదునిఁగూర్చి రవిపురాణమునఁ బల్కె. 91

గీ. భవునఖండబిల్వ పత్రంబునెవ్వఁడు
భక్తిఁ బూజసేయు బ్రియతుఁ డగుచుఁ
గృతకబుద్ధిగాక కృష్ణాష్టమీతిథి
నతఁడు బ్రహ్మహత్య నపనయించు. 92

క. హరహరయంచు మహానిశి
హరుని న్మారేడుపత్రి నర్చించినయా
నరుఁడు పితృ మాతృవధ ముఖ
దురితంబులఁ దొలఁగి శివునిఁదుదిఁ బ్రాపించున్. 93

ఉత్సాహ.

హరుని బిల్వపత్రముల సహస్ర సంఖ్యభక్తితో
నరుఁడు పూజచేసి పడయు నాకకేశులోకమున్
బరమపుణ్యుఁ డెప్పుడనుచుఁ బల్కె స్కాందసరణియం
దరుదుగాఁగ మును కుమారుఁ డాదిమునుల కర్మిలిన్. 94

క. ఖండేందు ధరునికొక్కయ
ఖండంబగు బిల్వపత్రకముఁ బూన్చినరుఁ
డుండును శివపురినని మా
ర్కండేయమునందుఁ బలుకు ఘనతరమహిమన్. 95

క. పంచాక్షర మంత్రంబునఁ
బంచానను శివుని బిల్వపత్రంబులన
ర్చించిన యానరుఁడు వినో
దించుఁ శివలోకమున నతిస్థిరమహిమన్. 96

గీ. గంధపుష్పాన్వితముగ లింగమునుభక్తి
మారెడనుపత్రిఁ బూజించి మానవుండు
శివపురంబున దివ్యయోషిత్సహస్ర
పరివృతుండయి సౌఖ్యసంపదలనొందు. 97

క. శంకరుని నొక్కమఱి సా
యంకాలము బిల్వపత్రి నర్చించి నిరా
తంకైశ్వర్య జ్ఞానా
లంకృతుఁడై యతఁడు శశికలాధరుఁ జేరున్. 98

క. పూతాత్ముఁడగుచుఁ బురుషుఁడు
భూతాధిపు దూర్వములను బూజించిమహా
పాతకము లెడలి శివపురి
నాతత మతినుండు నిర్మలాత్ముండగుచున్, 99

గీ. పాల మజ్జన మొనరించి పార్వతీశు
దూర్వములఁ బూజచేసిన ధుర్యయశుఁడు
సురభి గంధయశుండుఁ దేజోయుతుండు
నగుచు సర్వజ్ఞతాస్ఫూర్తి నతిశయిల్లు. 100

క. తెల్లని దుర్వాంకురములు
చల్లని గంధమును నట్టిసర్వజ్ఞునకున్
జెల్లించిన నరుఁడుండును
సల్లలిత విభూతి నభవసదృశుండగుచున్. 101

ఉ. కుంకుమ పంకయుక్తమయి కోమలమై చెలువొందునట్టి దూ
ర్వాంకుర రాజి శంకరుని నర్చనచేసిన మానవుండు ని
శ్శంకతనుండు మృత్యుభయ సంకటదూర విభూతినొంది యే
వంకనుదానయై శివునివాసమునందులనుండు వేడుకన్. 102

సీ. శివునుగంధములతోఁ జేమంతి పత్తిరి
నర్చించి తేజస్వియగు నరుండు
గంధధూపయుతంబుగాఁగ వావిలిపత్రి
నెమ్మిఁబూనిచి శివనిష్ఠఁగాంచుఁ
బడయు గాణాపత్యపద మర్కదళముల
నభవునిఁ బూజించి విభవముగను
మాకంద దళపూజ మహనీయ రాజసూ
యాశ్వమేధఫలంబు లందుచుండు

గీ. ఏకదళమాత్ర తులసి నయిఁ ద్ర్యశఁగొల్చి
వరుస ముయ్యేడుతరముల వంశభవుల
నుద్ధరించుచు నరుఁడు నిత్యోత్సవమున
శంభులోకంబుఁ జేరు నిస్సంశయంబు. 103

చ. కలరిగపత్త్రిన్ ముదిత ఖండనశైవ పదప్రతిష్ఠయున్
గలుగు సుగంధయుక్తి నొడికంబుగ ధూపితమైన యుత్తరే
న్ద్రళముల శంభుధామము గణప్రముఖత్వమురుద్రలోకమా
సులభము కొండమామిడి విశుద్ధదళావలి నీశ్వరార్చనన్. 104

గీ. గంధధూపాన్వితముగ లింగంబు నియతి
జమ్మిపత్త్రి నొక్కమాసంబు మనుజుఁ
డర్చనము చేసి శూలభృత్తనఁగఁ బరఁగు
గణములకు ముఖ్యభావ బు ఘనతఁ దాల్చు. 105

క. దమనంబున శివలింగము
శమయుతుఁడై పూజచేసి శంకరుకరుణన్
దమనకనామ గణంబై
యమరులచే నతఁడు పూజలందుచు నుండున్. 106

క. మరువంబులఁ బూజించుచుఁ
బరమంబగు భక్తియుక్తి భజియించి తుదిన్
బరిపూజ్యుఁడగుచు నుండును
నరుఁడమరులచే మరుద్గణమ్ములచేతన్. 107

క. మృదువైన మాచి పత్త్రిరి
మదనారిం బూజచేసి మానవుఁడొందున్
ముదమున మహదైశ్వర్యము
సదమల విభవంబు శంభు సాయుజ్యంబున్. 108

సీ. పూజింపవలయు శంభునిఁ బుష్పచయముఘన
విరులు లేకున్నఁ బత్త్రియు మేలు

దళములబ్బకయున్న ఫలములైనను లెస్స
యవియు నసంభవంబయ్యెనేని
తృణలతా గుల్మౌషధివ్రజంబు శుభంబు
వీని లేమిని మూలవితతియొప్పఁ
దదభావమున భక్తితాత్పర్యయోగంబు
పరిపూర్ణ నిత్య శోభనకరంబు

గీ. హరుని నర్చింప వీనిలో దొఱకినట్లు
సుస్థిరంబైన భావసంశుద్ధి గలిగి
శివుని భజియించు నరునకుఁ జేరుఁజువ్వె
భోగమోక్ష విభూతు లక్ష్యతముగాఁగ. 109

ఉ. హస్తములందు వస్త్రమున నాముదపాకున జిల్లెడాకునన్
న్యస్తముచేసి తెచ్చిన దళావళియున్ గుసుమవ్రజంబులుఁ
శస్తముగాదు, వీనిఁగొని శంకరుపూజ యొనర్చిరేని సు
వ్యస్తముగాఁగఁబోవు నొకయబ్దసహస్రములైన పుణ్యముల్. 110

వ. ఈ క్రమంబున శివలింగంబునకు మనోహరంబుగాఁ బూజ యొన రించి తదనంతరంబ ధూపంబు సమర్పించునది. తత్క్రమంబు క్రియాసారంబునఁ జెప్పిన తెఱంగు నెఱిఁగించెద. కనక రజత తామ్రాది లోహంబులనొండె మృణ్మయంబుననొండె డమరుకా కారంబుగా ధూపపాత్ర నిర్మించునది. 111

గీ. చందనంబు కచోరంబు సజ్జరసము
కోష్టువగరు జటామాంసి గుడము నఖము
శర్కరాక్షౌద్రములు వీని సంగ్రహించి
ధూప మొనరింప నుత్తమ ధూపమంద్రు. 112

సీ. అగరును లక్క యందుగుచెక్కరాబువ్వ
కప్పురంబును లవంగంపుఁజెక్క
కురువేరు ముస్తెలు గుగ్గులంబేలకుల్
మలయజాతము జటామాంసి నఖము

సరళదారువు సుకోష్టము గ్రంథితగరమ్ము
శర్కర వటివేళ్లు జాజికాయ
మారేడుపండు కచోరంబు మహిసాక్షి
యుననొప్పు నిరువదియును ఘటింప
గీ. రాజితంబగు నివి ధూపరాజమనఁగఁ
గోష్టు చందన కర్పూర గుగ్గులములు
నగరు ఘృతమును దేనెతో నందుఁగూర్ప
సిద్ధధూపంబునాఁగఁ బ్రసిద్ధికెక్కు. 113

సీ. తగుదారువును హారీతకి జటామాంసియు
గుగ్గులంబదియు నొక్కొక్కపాలు
భద్రము స్తైలు నాల్గుభాగంబులును బుల
ఖండంబు పదియును రెండుపాళ్లు
గుడములోని సగంబు కోష్టువభాగంబు
పాషాణకుసుమంబు భాగయుతము
దానికి లక్క సమానమై విలసిల్లు
నఖమేనుపాళ్లు వర్ణనకునెక్కు
తే. నిన్నియునుగూర్చి యెన్నిక నెసఁగునదియు
ధూర్జటికిఁ బ్రియము దశాంగ ధూపమనఁగ
నిట్టి ధూపచయంబునం దేదియైనఁ
గూర్చి యర్చింపవలయు భర్గునకుభక్తి. 114

క. ధరణీసుర వరులకు నీ
ధరణీతలమెల్ల ధాన్యధనయుక్తముగా
గురునిష్ఠ నొసఁగు ఫలములు
హరునకు నీధూపచయము లర్పింపనగున్. 115

గీ. ఘృతము తగఁగూర్చి ప్రీతి గుగ్గిలపుధూప
మర్ధమాసంబు శివునకు నర్పితంబు

సేయు నెవ్వాఁడు వాఁడుండు శివపురంబు
నందు శాశ్వతమైన సౌఖ్యమును గలిగి. 116

గీ. సర్జరసమున ఘృతమున శంకరునకు
ధూపమిడి సప్తభవముల దుష్కృతమును
భస్మమొనరించు నరుఁడీశు భవనమునను
గోటి వేలేళ్లు నిలుచు నెక్కుడు విభూతి. 117

క. మహనీయ మహిమ శంభుని
గృహమున వసియించు నరుఁడు ఘృతయుక్తముగా
మహిసాక్షి ధూపమిడి ప్ర
త్యహమును గణకోట్లుగొలువఁ దాఁ బ్రముఖుండౌ. 118

క. మలహరునకు బిల్వంబుల
ఫలసారము నేతఁగూర్చి పావనమహిమల్
వెలయఁగ ధూపంబిచ్చినఁ
గలుగును గోకోట్లదాన ఘనపుణ్యంబుల్. 119

వ. తదనంతరంబ దీపంబులకుఁ గనకరజతాది లోహంబులఁ జిత్రా
కారంబులుగాఁ బాత్రంబులు పెక్కువిధంబుల నిర్మించి యందు 120

ఉ. మానుగఁ బత్తివత్తినగు మానితసిద్ధులు పట్టువత్తిను
జ్ఞానకరంబు వీనిఘనసారరజస్సముదాయ గర్భముల్
గానొనరించి మంచికపిలాఘృతముందగనించి దీపమీ
శానునకెత్తఁ గోటిగుణసంచిపుణ్యఫలంబు చేకుఱున్. 121

గీ. కపిలనేత సాత్వికంబగు దీపంబు
రాజసంబు తైల యోజితంబు
తామసంబు నేయి తైలంబుఁ గూడిన
మానుషాఖ్య మితరమైన నేత. 122

క. సకలద్రుమ బీజంబులఁ
బ్రకటంబగు తైలయుక్తిఁ బరఁగంబై శా
చికమనఁగ దీప మీశ్వరు
నికి నిడినను దామసంబు నిందక్యంబెంకున్. 123

గీ. ఈక్షితిఁ బ్రశస్తమైనట్టి వృక్షబీజ
తైలములలోన నొక్కటి తనరుచుండు
నిప్పనూనియు దాన సర్వేశ్వరునకు
దీపమర్పించిరేఁ బాయుఁ బాపచయము. 124

గీ. ఒకరు రెండుమూఁడు నొక్కటియైనను
అంగుళములఁ బొడవు లమరునట్టి
దీపశిఖలఫలము దీపించును త్తమ
మధ్యమాధమ ప్రమాణములను. 125

క. పగలెత్తు దీపముఁ కున్
ద్విగుణంబు ఫలంబు రాత్రి దీపంబిడినన్
మిగుల విశేషం బెన్నిక
కగు ఫలము పదింట మీఁద నటనైనైనన్. 126

చ. కరము విసీతి నీసునకుఁ గార్తికమాసము దీపమాలికల్
పరగఘృతంబు నించి తసపాత్రల నెన్నిటనెత్తు నన్ని వేల్
వరయుగముల్ వసించుఁ దనవంశమువారును దానుఁగూడిశం
కరపురిఁ గోటి సూర్యుల యఖండరుచిశ్ మనుజుంఘుపెంపునన్. 127

క. నిమిషార్థ కాలమైనను
నిమిషంబైనను ఘృతంబునించిన దీపం
బమర నిడి నరుడు శివపురిఁ
దెమలఁడు శతకోటి సంఖ్య దివ్యాబ్దంబుల్. 128

వ. తదనంతరంబ కాహళ పటహ శంఖ భేరీ జయఘంటికాది శింజితంబులగు పంచమహావాద్యంబుల నృత్తగీత ప్రబంధంబుల వినోదంబు సలిపి ఛత్ర చామర వ్యజనదర్పణాద్యుపచారంబుల మహోత్సవం బొనరించి నరుండు శతకోటి దివ్యయుగంబులు రుద్రలోకంబు వడయు. పంచాక్షరీ మంత్రోపాసనంబు సేయునది. తన్మహిమ యెట్టిదనిన. 129

సీ. హరదృఢజ్ఞాన శక్త్యాత్మకంబని యెద్ది
నగఁడుచ్చరించి తన్మయతగాంచు
నిగమోక్తమని యెద్ది నిఖిల దేవర్షులు
సంచితగతి నాదరించినారు
మనన సంత్రాణ ధర్మమున మంత్రములలో
నధికాధికంబేది యరసి చూడ
నేమంత్రమునయందు నెల్ల మంత్రంబులు
పొరిపొరి నణఁగుచుఁ బుట్టుచుండు
తే. నెఱిఁగి పఠియింప నధికారు లెల్లవారు
పతిత చండాల దుర్వృత్తి పాపయుతులు
నభవులోకంబు గాంతు రెయ్యది జపించి
యా మహావిద్య యొప్పు బంచాక్షరంబు. 130

వ. అట్టి పంచాక్షరంబు సద్గురుపరంపరాగతమైన నభిమత ప్రదంబని వాయవ్య సంహితబలుకుఁ మఱి గ్రంథాంతరంబునఁ బలికిన తెఱంగు. జపమాలికా తారతమ్యంబును నాయాదిక్కుల మొగంబై జపంబు సేయనగు ప్రయోగ సిద్ధియు వివరించెద. 131

సీ. జపమంగుళులనెన్నఁ జను నొక్కటొక్కటై
యారేఖల నొనర్ప నష్టగుణము
పుత్రజీవంబులఁ బొసఁగుఁ బదింతలై
శంఖరత్నంబుల శతగుణంబు
విద్రుమ వితతిచే వేయుగుణంబులు
పటికంపుఁ బూసలఁ బదియు వేలు

వెలయంగ ముత్తియంబుల లక్షగుణములు
అటఁ బదిలక్షలబ్జాక్షములను

గీ. బాటిగాఁ బైఁడిపూసలఁ గోటివృద్ధి
తనరు శతకోటిగుణములై దర్భముళ్ళ
నగణితంబగు ఫలము రుద్రాక్షములను
నక్షమాలిక లొనరింప నలరువీన. 132

సీ. వాసవముఖమైన వశ్యసంసిద్ధియా
వహ్నికి నెదురైన వ్యాధు లెడలు
యామ్యాభిముఖమైన నాభిచారికవృత్తి
నిర్ఋతి మోమున శత్రునిచయ మణఁగుఁ
బశ్చిమముఖుఁడైనఁ బ్రబలు నర్థంబును
గాలి మోమైన నాకర్షణంబు
కౌబేరముఖమైనఁ గలుగు శాంతిస్థితి
యీశాను ముఖమైన నెసఁగు ముక్తి

గీ. కాన నాయాయి దిక్కుల క్రమమెఱింగి
ప్రణవ పంచాక్షరీమంత్ర భవ్యజపము
గరిమఁ గావించి పడయు సంకల్పసిద్ధి
నరుఁడు దృఢభక్తి భవుని డెందముననిల్పి. 133

చ. పరహిత సచ్చరిత్ర, నిరుపాధిక భూరిదయా విచిత్ర, స
త్పురుషవిధేయ ధీవిభవ, పోషితబాంధవ, బంధురక్షమా
భరిత నిజాంతరంగ, భవపాదసరోరుహ మత్తభృంగ, సు
స్థిరసుగుణాభిరామ, పరిశీలిత శైవ మహాగమక్రమా! 134

క. లింగావధాన సంతత
సాంగత్య పవిత్రమానస స్ఫుటలీలా
జంగమ మయయుత లింగా!
అంగీకృత వినయ విశ్రుతౌదార్యనిధీ! 135

## తోటకవృత్తము

భూనుత కీర్తి విభూతివిశేషా !
మానిత సత్యసమన్వితభాషా !
మానుషదీప్తి సమాహితవేషా !
మానరమానుపమాన విభూషా ! 136

## గద్యము.

ఇది శ్రీ దుర్గాంబికా పరప్రసాదాసాదిత కవితా విలాస భాసుర శ్రీమదహోబలామాత్యపుత్ర సుకవిజనమిత్ర, సకల విద్యావిధాన తిరుమల నాధాభిధాన ప్రణీతంబైన శైవాచార సంగ్రహంబును కృతియందు శివపూజావిశేషం బులకు వివిధ కుసుమంబుల ఫల తారతమ్యంబులును, లింగార్చనా యోగ్యంబులగు పత్ర ఫల మూలౌషధి వివిధ తిలాక్షత దూర్వాలక్షణంబును ధూపదీప వాద్య నృత్యగీత ప్రబంధ వివిధ వినోద క్రమంబును ఛత్రచామర వ్యజన దర్పణాద్యు పచారంబును బంచాక్షరీ మంత్రో పాసన మహిమయు నన్నది ద్వితీయాశ్వాసము.

ఓమ్

# శైవాచారసంగ్రహము

## తృతీయాశ్వాసము



క. శ్రీమత్పంచాక్షర జప
సామర్థ్య దృఢీకృతాత్మ సంకల్ప, కళా
ధామ, నయసీమ, వినయర
మా మహిమోద్ధామ, గన్నమంత్రిలలామా! 1

వ. తదనంతరంబున నంబికా మనోహరునకు నైవేద్యంబులు సేయు ద్రవ్యవిశేషంబులు వినుము. రచియించు తత్క్రమంబును కనక రజత కాంస్యలోహంబుల నిర్మించిన పళ్ళెంబులను స్థావర లింగంబులకు యథాశక్తి క్రమంబున, ప్రాణ లింగంబునకుఁ దద్విహిత పరిణామంబునుగా నివేదించు తత్క్రమంబును వీరతంత్రంబునఁ బితామహునకు నీశ్వరుం డానతిచ్చిన తెఱంగు వివరించెద. 2

గీ. దూసవడ్లను యవలు గోధుమలుఁ దెల్ల
రాజనంబులుఁ గొఱ్ఱలు రాజనములు
నల్లవడ్లును బెనురాజనాలు మంచి
వెదురు బియ్యంబు మేలు నైవేద్యమునకు. 3

సీ. మెఱుఁగుదాఁకఁగ నొయ్య మెత్తచేసినఁ గొప
విఱుఁగక తెలుపాఱు వెలఁది ప్రాలు
నల్లనీరువడంగ నయముతో నల్లనఁ
గడిగి నానఁగ నిచ్చ క్రమముతోడ

వస్త్రపూతంబైన వారి మృత్పాత్రమాది
కస్థాలి నెసరునుగా ఘటించి
కేశ యుక్తంబులు క్రిమిజుష్టములుగాని
చిటులని కట్టెలఁ జిత్రభంగి

గీ. యత్నమున వండ నది దేవలాన్నమంద్రు
ప్రాలకును బాలు మున్మడి పాలలోన
సగము వెన్నయు నందులో సగము పెసర
పప్పుఁ బచియింపఁ బరమాన్నమొప్పు మిగులు. 4

గీ. పెసర పిండికి నినుమడి బియ్యమునను
జీరకంబును తగుహరిద్రారజంబుఁ
బెరయు, జలముల నుడికించి మరిచి చూర్ణ
మందుఁ గూర్పంగ నిది హరిద్రాన్నమంద్రు. 5

చ. అనువగు నువ్వులోడ మఱి యల్లముతో మిరియంబుతోడఁది
య్యని పులుపైనయాల పెరుగంశుకసంగతి నీరువుచ్చి యిం
పొనరగ తండులత్రిగుణమోదన యుక్తముగా రచించినన్
దనరు గణింపగా నిదియు ధారుణిలో దధిమిశ్రితాన్నమై. 6

క. అరపాలు పెసర బేడలు
నెఱ పాల్బియ్యంబు నీళ్ళ నెఱివండి పయిన్
మిరియము నువు బిండిడినన్
సరసత నన్నంబు కృసర సంజ్ఞకమయ్యెన్. 7

గీ. తండులము లొక్కపాలు దుగ్ధములు మూఁడు
పాళ్ళు బియ్యంబు పాలలోపల సగంబు
గుడములో సగము ఘృతమ్ము గూర్చివండ
నది గుడాన్నాఖ్యఁ బరఁగు భూవిదితమగుచు. 8

క. ఖండిత ముద్గము లొకపా
ల్తండులములు నొక్కపాలు తగఁ దోయములన్

వండిన ముద్గాన్నంబన
మండలమునఁ బరఁగు నిరుపమస్ఫురుచులన్. 9

వ. శుద్ధాన్నంబునకుఁ దక్కిన యోగిరంబుల లవణంబులు పెట్టునది. మఱి నీరుక్రమ్మునదియును, పొట్టు తోడిదియు, నపక్వంబైనదియు, మాడినదియును, బురాణభాండంబుల వండినదియు. నైన యన్నంబు నైవేద్యంబులకు సనర్హంబగుట వీని వర్జించునది. 10

క. మినుములు కందులునుఁ జిఱు
సనగలు ముద్గములుఁ బొట్టు సడలించి పచిం
చినఁ బప్పున కర్హము త
క్కిన వెల్లను గావు సూపకృత్యంబునకున్. 11

గీ. పనస యరఁటి మాదిఫలము రసాలంబు
నారికడము నిమ్మ నారదంబు
వీనిఫలము లెంతయేనియు ముఖ్యముల్
శివునకర్పణంబు సేయుచోట. 12

క. కందయుఁ బెండలమును జిఱు
కందయు నల్లంబుఁ బ్రీతికరములు జగతిన్
గందములలోన శివునకు
నందముగా వీనివండి యర్పింపనగున్. 13

గీ. చెమ్మ దోస ములగ గుమ్మడి యాలాబు
నేలములుగ పొట్ల నేతిబీర
బీర కాకరఁగఁ బెంపొందు కాయలు
శాకకృత్యమునకు [?] సమ్మతములు. 14

గీ. ఆవ పులుసు లవణ మాజ్యంబు హింగువు
జీలకఱ్ఱ మిరియ మేలకులును
వెలయ మేళవించి వివిధ పాకంబులై
యుండఁ గూరలెల్ల వండవలయు. 15

సీ. కాని భాండములసంగతి నున్నయది గాక
మును గేమియును లేక మురికి గాక
పాటిమాలఁడు వ్రతభ్రష్టుఁడు మంగలి
పతితుండు వీరిచేపట్టు లేక
కేశయుక్తము గాక క్రిమి కాక సూకర
శ్వఖరాది జంతుసంస్పర్శ లేక
వారభామిని రజస్వల విటాధముఁడు కుం
టెనకత్తె వీరు ముట్టినది గాక

గీ. తనరు నాజ్యంబు నైవేద్యమునకు లెస్స ;
కపిలధేనువు నేయందుఁ గరము పెద్ద ;
ధవళమగు నావునేయి మధ్యమముజగతి ;
నగుఁ గనిష్ఠంబు తక్కి నయావునెయ్యి. 16

వ. మఱియు దధిక్షీర నింద్యాన్నంబులు పరిహరించి, యపక్వంబు లగునవియును, గాటుపోయినవియునుం గాక సుపక్వంబైనవియు నైవేద్యమునకు ఘటించునది. 17

క. బోనము మీఁదికి నాజ్యము
మానితముగ తండులాష్టమం బగుభాగం
బానెఱి లేమిఁ దదర్థం
బైనను సందర్థమైన నర్పింపనగున్. 18

చ. అరిసెలు బూరెలున్ గడియపట్లును గారెలు ఖండమండెగల్
గరిజలు లోనుగా మరిచిఖండ ఘృతార్ధకజీర శర్కరా
పరికర మిశ్రితంబులగు భక్ష్యములున్ సువిచిత్రపాకసం
భరిత పదార్థజాలమును భర్గునకున్ సమకూర్ప మేలగున్. 19

వ. మఱియును వివిధ భోజ్య లేహ్యచోష్య పానీయంబులు సమర్పించునది. వీని ఫల తారతమ్యములు వివరించెద. 20

గీ. కేవలక్షీర యుక్తంబు ఘృతరసంబు
గుడయుతము దుగ్ధసహిత మక్షుద్రమహిమ

విధుకిరీటునకర్పింప వేయుగుణము
లొక్కటొకటికి ఫలములీ యోగిరములు. 21

క. నైవేద్య తండులంబులు
భావింపఁగ లెక్కకెన్ని పట్టుద్దులగున్
గావించు శివుపురస్థితి
కైవల్యం బన్నివేల యుగంబులు వరుసన్. 22

క. అన్నమునకుఁ గోటిగుణం
బెన్నఁగ భక్ష్యములు శివునకిడఁ దత్ఫలముల్
సన్నుత జపోపవాసా
భ్యున్నతమఖ దానతీర్థముల ఫలమిచ్చున్. 23

వ. తదనంతరంబ యాచమనీయంబును ముఖవాసనంబును సమర్పించి తాంబూలంబు నొసంగునది. తత్క్రమంబు క్రియాసారంబునఁ బల్కిన తెఱంగెఱిఁగించెద. 24

క. ఏలకులు కప్పురము త
క్కోలము జాదియు లవంగ కుసుమము గూడన్
ఫాలవిలోచనునకుఁ దాం
బూలం బర్పింపఁదగు సమున్నత భక్తిన్. 25

ఉ. పంచసుగంధ యుక్తముగ భర్గునకున్ మనుజుండు తమ్ములం
బంచిత భక్తియుక్తిని సమర్పణచేసి సుగంధ దేహుఁడై
మంచిరుచుల్ వెలుంగఁగ సమాహిత సౌఖ్యము లొందుచుండునా
పంచశరారిలోకమును బాయక కోటియుగంబు లిమ్ములన్. 26

వ. అటఁ బ్రదక్షిణ నమస్కారము లాచరించునది. 27

క. శివునకు నీ చెప్పినగతి
నవరంగా షోడశోపచారములును న
ష్టవిధములగు నర్చనములు
నవిరళ విభవంబుతోడ నగుఁ జేయంగన్. 28

వ. మఱియు లింగార్చన కాల విశేషంబు లెట్టివనిన. 29

సీ. చుక్కలతమ దీప్తిసొబగు తప్పకమున్నె
యరుణోదయార్చన కభిమతంబు
సవితృమండల మర్ధ సందీప్తమగుచుండఁ
దపనోద యార్చనోత్సవము మేలు
ఘటికాత్రయము మీఁద గడియలు నాలుగు
[1] సంగమార్చనకును సమ్మతంబు
మార్తాండుఁ డంబర మధ్యంబుఁ జేరిన
మధ్యాహ్నపూజకు మానితంబు

గీ. సాయమర్చన శుభము భాస్కరుఁడు గ్రుంకి
యుక్తమగు నావలీవల నొకముహూర్త
మర్ధరాత్రంబు, పూజా నియమ మెఱింగి
హరునిఁ బూజింపవలయు మోక్షార్థులెలమి. 30

క. ఉడురాజ ధరుని శంభునిఁ
గడువేడుకతోడ నీలకంఠుని నియతిన్
విడువక పూజించిన న
య్యుడుపల మజనకును నలవియే వాక్రువ్వన్. 31

వ. మఱియు శివార్చనాయత్త వృత్తుల వర్తనంబు లెట్లన్న శివనిందాత్ములును దుష్కర్ములును మద్యమాంసాహారులునగు నట్టివారల దర్శన స్పర్శన సంభాషణంబులు సేయక యితర వ్యాపారంబుల యందుఁ జిత్తంబు నునుపక క్రోధ దురాలాప వర్జితుండై శివైకాగ్ర చిత్తుండైన శివార్చనా ఫలంబు సఫలంబగును. ఆ శివ పాదోదక ప్రసాదోదక సేవా మహత్త్వంబు వివరించెద. 32

గీ. పాద్యమిచ్చినదియుఁ బాదోదకంబగు
నగుఁ బ్రసాదతోయ మర్పితంబు
లింగ తీర్థమండ్రు లింగాభిషేకంబు
నాచరింపఁ బుణ్యమగు జలంబు 33

1. సంగమము అనగా సూర్యోదయాత్ప్రభృతి యేడు గడియలు గడచిన మీఁదటి కాలమునకు సంజ్ఞ.

క. పురుషుఁడు శుచియై గిరీశ
స్మరణము సేయుచును లింగజలములు మేనన్
శిరమునఁ బరిమార్జనముల్
పరువడిఁ జేసినను నిర్మల స్నానముగున్. 34

క. గోదావరి భాగీరథి
కేదారము యమున శిప్ర కృష్ణ మొదలుగా
మేదినిఁగల తీర్థములు ప్ర
మోదించును లింగ తీర్థముల మిశ్రములై. 35

క. లింగాభిషేక జలమును
లింగాంఘ్రి సరోజజలము లింగార్పితమున్
భంగించు హీన మానవ
సంగతరోగముల దురిత సంఘాతములన్. 36

క. శైవ ప్రసాద తోయము
సేవించి మనుష్యుఁడశుచి చిరతరశంకల్
భావించుచు నాచమనము
గావించిన నరుగు బ్రహ్మఘాతకు గతికిన్. 37

క. నరుఁడు కురుక్షేత్రంబున
నరుదుగ వారాణ శీ ప్రయాగలను మృతిం
బొరసిన సగుగతిఁ బొందును
హరుపాదజలంబు శిరమునందునిచి తగన్. 38

మ. సరయూ సింధు సరస్వతుల్, యమున, కృష్ణా నర్మదా సేతువుల్
సరపిన్ గోమతి చంద్రభాగ మొదలెంచంబడ్డ తీర్థాళిఁ ద
త్పరతన్ గ్రుంకు సహస్రకోటి ఫలముం బ్రాపించు నత్యున్నతిన్
హరపాదోదక ధారణంబు నరుఁడుద్యద్భక్తిఁ గావించినన్. 39

క. శిరమున హరపాదాంబువు
ధరియించిన, గోసహస్ర దానఫలంబుల్
నరమేధఫలము బహుసువర్ణ
తురంగ మేధాది ఫలముదొరకు నరునకున్. 40

సీ. బ్రహ్మరాక్షస యక్ష గ్రహ పిశాచప్రభూ
త ప్రేత ముఖ్య విధ్వంసనంబు
క్షయ కుష్ఠ గుల్మాది సకలరోగవ్రాత
పరితాప నిగ్రహ భంజనంబు
విష శస్త్ర ఘోరాగ్ని విద్యుత్పటోచ్చరాది
భీతి సంకట వినిర్భేదనంబు
శరభ సింహవ్యాఘ్ర కరిసైరిభాదిక
బహుసత్త్వ సముదాయ గ్రహహారంబు
గీ. వంశ పౌరుష తేజో వివర్ధనంబు
కాంతి బల ధైర్య శౌర్య సౌఖ్యప్రదంబు
పావనకరంబు ధారణ ప్రాశనములు
సర్వ ఫలదంబు శంభు ప్రసాదజలము. 41

వ. మఱియుఁ బ్రసాద ఫలము జైమినికి బాదరాయణుండు శైవ సంహితం జెప్పిన క్రమంబు చెప్పెద. 42

శా. నా నైవేద్యము పాదతోయము ప్రసూనవ్రాతముల్ బత్రసం
తానంబుల్ గొనఁగా ననర్హములు తథ్యంబంచు నీశుండు ముల్
మౌనిశ్రేణులతోడఁ బల్కెనని [యాత్మజ్ఞుల్][1] దృఢప్రజ్ఞతన్
గానంబల్కుదు రిత్తెఱంగు తెలియంగా నానతీవే దయన్. 43

వ. అని జైమిని యడిగిన వ్యాసుం డిట్లనియె. "అనర్హం మమ నైవేద్యం" బను నీశ్వరవాక్యంబులకు నైవేద్యశబ్దంబు నానార్థవాచకంబై యుండు. ముఖ్య గౌణార్థ మిదమిత్థమని నిశ్చయింపఁదగు. అది భవిష్యత్పురాణాద్యాగమోక్తంబునఁ బలికిన తెఱఁగు. దేవస్వంబును, దేవతాద్రవ్యంబును నైవేద్యంబును, నివేదితంబును, చండద్రవ్యంబును, బహిఃక్షిప్తంబును నన్నవి షడ్విధంబులగు. దేవతాగ్రామంబులును, భూములును, అలంకరింపఁబడిన సొమ్ములును నివి దేవస్వంబనంబడు. ఉపకరణంబులును ధనధాన్యాది చ్ఛత్రచామరాది వస్తువులును దేవద్రవ్యంబు లనంబడు.

---

1 యాత్మజ్ఞుండున్ కా. ప్రతి తా. ప్రతి

అన్నపాన భక్ష్య భోజ్య లేహ్య చోష్యాది పదార్థంబులు సంక
ల్పించు నవియు నైవేద్యంబనంబడు. ఇవి యర్పితంబైనమీఁదట
నివేదితం బనంబడును. స్వాయంభువ స్థానంబులు ప్రాణలింగంబులుఁ
దక్క నర సురాదులచేతఁ బ్రతిష్ఠితంబైన స్థావర లింగంబుల
యందు చండద్రవ్యంబును, బూర్వసంధ్యా సమర్చనవేళలఁ దరమిన
నిర్మాల్యంబును బహిఃక్షిప్తం బనంబడు. ఈ యాఱింటియందును,
దేవస్వంబును దేవతా ద్రవ్యంబును, నైవేద్య సంకల్ప్య పదా
ర్థంబులును నివేదితంబులుగాని నైవేద్యంబులును నీ మూఁడు
నెవ్వరికిం గొనరామి నసర్పంబగు. చండద్రవ్యంబు తద్భోగ్యా
ర్హులకుఁ దక్క నితరుల కనర్హంబనంబడు. నివేదితంబైన యన్న
పానాదులును బహిఃక్షిప్తంబైన నిర్మాల్యంబును గైకొన నర్హంబు.
తద్భేదంబు వివరించెద. 44

సీ. దక్షాధ్వరమునన దక్షుత వీరభ
ద్రునిచేత శప్తులై చనినవారు
భవుని కన్యములైన పరదైవములయందు
ననురక్తులై యున్న యట్టివారు
తరుణేందు శేఖరుఁ దక్కఁ దుం దైవంబుఁ
దమబుద్ధి సముముగాఁ దలఁచువారు
గురుభక్తియుక్తి సద్గురు కటాక్షమునను
వారదీక్ష వడయని యట్టివారు

గీ. భరపరాఙ్ముఖ చిత్తులై పరఁగువారు
శుద్ధమగు కర్మ మొనరింపఁ జొరనివారుఁ
దనరు మాహేశ్వర ప్రసాదములు నాల్గుఁ
గొనఁగ నర్హులుగారు నిక్కవము ధరణి. 45

క. నిర్మల మగుటను శంకరు
నిర్మాల్య మనిందితంబు ; నిజమగుశివ స
ద్ధర్మము లేక మలత్రయ
నిర్ముక్తుఁడుగాక వచ్చునే సేవింపన్. 46

క. శివ సంస్కార విహీనుఁడు
శివుని ప్రసాదంబునందు జిహ్వాచాప
ల్యవశత సేవించిన రౌ
రవమను నరకంబునందు వ్రాలుం బెలుచన్. 47

వ. మఱియు నిట్టివారు శివప్రసాదము సేవింప నధికారులు గామిం జేసి వీరికి నవరణంబగు. శాస్త్రానుకూల్యంబున శివసంస్కారులగువారికి శివప్రసాద సేవనంబున నయ్యేడు ఫలం బెట్టిదనిన. 48

క. నిరశనతపస్సహస్రము
పౌరిఁ బ్రాజాపత్య కృచ్ఛ్రములు పదివేలున్
దారయును శివప్రసాదతఁ
బరఁగిన యొక మెతుకు కోటిభాగంబునకున్. 49

గీ. పడయు నిర్మాల్య పత్రపుష్పములుదాల్చి
శంభుసాలోక్యపద ; మంఘ్రిసలిల సేవఁ
దనరు సామీప్యగతి ; ప్రసాదము భుజించి
నరుఁడు సారూప్యమహిమ వర్ణనకు నెక్కు. 50

గీ. ఇష్టలింగార్పిత ద్రవ్య మెద్దియైన
నొరుల కిడరాదు గోవుల కొసఁగరాదు
భూ జలంబులఁ గలపంగఁ బొందుపడదు
తానె భుజియింప వలయు నత్యంత నియతి. 51

క. కొనరాదు ప్రాణలింగికిఁ
దన లింగంబునకుఁ దక్కఁ దక్కినలింగం
బునకిచ్చిన నైవేద్యము
జననుత లింగప్రసాద సంకరమగుటన్. 52

క. వ్రతముల నుపవాసంబులఁ
గుతిలపడంజనదు లింగగోచరుఁ డెందున్
వితతమగు దేహదండన
హితమగునే ముక్తిఁగోరు హితమతి కెందున్. 53

క. బ్రహ్మాది సురులు మునులు న
జిహ్మగతి శివప్రసాద సేవానియతిన్
బ్రహ్మత్వాది పదంబుల
బ్రహ్మాండమునందు వెలసి పరఁగిరిమహిమన్. 54

మ. శివపాదోదక మేళిత ప్రసవముల్ సేవించి శేషుండు ము
న్నవనీభార ధురంధరుండును భుజంగాధీశుఁడున్ బార్వతీ
ధవహస్తాంచిత భూషయున్ వివిధ విద్యాజాల సర్వజ్ఞుఁడున్
జవసత్వోన్నత శక్తిసంయుతుఁడునై సాధించె కీర్త్యున్నతుల్. 55

సీ. దీపంబు తుదగాక దీపింప వరుసతో
నుపచార సముదయం బొప్పమిగిలి
పేర్మి నైవేద్య మర్పించు నందాఁకను
సమధికమతులు పూజనములందు
నైవేద్య హీనమైన గణింతు రర్చన
కంగలోపంబని యార్యజనులు
తత్ప్రసాదము నిజాత్మకుఁ జెల్లునందాఁక
నడుచు నైవేద్యార్పణము ధరిత్రి

గీ. వినయమునఁ దత్ప్రసాదము గొనకయున్న
నర్పితము నిష్ఫలంబగు నదియుఁగాక
సడలినట్లయినఁ బూజా ప్రసాదలోప
మైన మనుజుండు తత్ఫల మంద లేఁడు 56

వ. మఱియుఁ గాశీఖండమునఁ జెప్పిన తెఱంగెఱిఁగించెద. 57

గీ. ఇలఁ బ్రసాదంబు త్రివిధమై యెన్నఁబడును
శుద్ధమన సిద్ధమనఁగఁ బ్రసిద్ధమనఁగ
లింగ జంగమ గురుభేద సంగతులను
రూప రుచి మిశ్రితార్పణల్ రూఢికెక్క. 58

క. లింగార్పితమగు రూపము
లింగమయాంగుండు నగుచు లెస్సగొనంగా

సంగీ (?) రుచి సమర్పణ
కంగీకృతి లేదు శివరహస్యముఁ గనన్. 59

ఆ. వె. అధిక పాపయుక్తుఁడైనఁ బ్రాయశ్చిత్త
విధులు వేఱ జగతి వెదకనేల
గురుమహాప్రసాద పరసేవ గలిగినఁ
బురుషులెందు ఘనులఁ బుణ్యమతులు. 60

వ. ఇవ్విధంబునఁ బ్రసాద స్వీకారంబు తుదగా లింగార్చనంబు సేయు
వాఁడు భక్తుండు. మఱియు మాహేశ్వరుం డెట్టివాఁడనిన. 61

సీ. జనియించునతనికిఁ జావునిక్కంబను
నిశ్చయం బెవ్వాఁడు నిలుపనేర్చుఁ
దనకు నూరేళ్లు నిండినవిగాఁ దలఁచుచు
సాహసం బెవ్వాఁడు జరపు భక్తిఁ
బరధనంబులయందుఁ బరభామినులయందుఁ
జిత్తంబు నెవ్వాఁడు చేర్పకుండుఁ
గామార్థములకునై కాంక్షించి మదినెవం
డాచరింపఁడు శంకరార్పణంబు

గీ. పరుల సేవింపఁ డెవ్వాఁడున్నతులకొఱకు
వ్రతము నెడ నర్థలోభ మెవ్వనికి లేదు
సౌఖ్య దుఃఖంబు లెవ్వాఁడు సరకుగొనఁడు
వాఁడు మాహేశ్వరఖ్యాతి వసుధ వెలయు. 62

సీ. కాలసంగతి మృత్తికంబైన యుదకంబు
క్రమ్మఱ నుదకంబు గానియట్లు
పరుసంబు సోఁకినఁ బసిఁడియై లోహంబు
క్రమ్మఱ లోహంబు గానియట్లు
తప్తంబుసేయ ఘృతత్వ మొందిన వెన్న
క్రమ్మఱ దా వెన్న గానియట్లు
తగహుతాశన పక్వమగు మంటికలశంబు
క్రమ్మర తా మన్ను గానియట్లు

గీ. లింగనిష్ఠఁ బూర్వాశ్రమ సంగముడిగి
శివ సమాశ్రయ మహిమ భాసిల్లు నతఁడు
పరమ మాహేశ్వరుండనఁ బరఁగుచుండు
నతఁడు మఱి జన్మదుఃఖంబు లంద లేఁడు 63

గీ. భవమునకు రోసి లౌకిక ప్రజ్ఞఁబాసి
కడిమి నింద్రియ గుణములు కట్టిపెట్టి
భవునిఁ జేపట్టి తనయంతఁ బరఁగు నతఁడు
విగత పూర్వాశ్రయుండైన విమలబుద్ధి. 64

క. ఇతరములగు ధర్మంబులు
మఱిఁ దలఁపక శివునియందు మగ్నాత్ముండై
మఱికెక్కనతని కీశ్వరు
డతులిత కరుణావిధేయుఁడై వర్తించున్. 65

వ. అని సిద్ధాంత శిఖామణి స్తోత్రార్ణవ శివధర్మోత్తర వాశిష్ఠ భగవద్గీతల శైవరత్నాకరంబునఁ బలుకు. మఱియుఁ బ్రసాది యెట్టివాఁడనిన. 66

చ. ప్రమదమునొందు చిత్త పరిపాకముతోడుత మోక్షసిద్ధిక
న్యములగునట్టి యింద్రియ విషయంబుల సౌఖ్యములుజ్జగించుటల్
సమమతియునిక్కయుక్తి ధరఁ బ్రసాదమనంబడు శంభుసేవఁ బెం
పమరిన తత్ప్రసాదగుణ మందినవాఁడు ప్రసాదినాఁజనున్. 67

క. లింగప్రసాది కన్యా
సంగము భంగంబు యానశయనాసనవా
క్సంగమ భోజన నియమా
భ్యంగములను, నరకవాస ఫలదంబగుటన్. 68

క. అనుభావ్యము గలవస్తువు
లనురాగంబున శివార్చనాకలన నరుం
డొనర సకలేంద్రియంబుల
ననుభవ మొనరం బ్రసాదియగు నెయ్యెడలన్. 69

క. వివిధౌషధముల భ్రమపడ
కవధానంబునఁ బ్రసాది వ్యాధుల కెల్లన్
భవరోగ వైద్యుఁడగునా
శివుని ప్రసాదంబుగాను విశేషంబగుటన్. 70

క. వెలయఁగ లింగార్పితమై
యలరిన వస్తువులు తానుననుభోగింపన్
వలయును లింగాంగుండై
యిలఁ గావు ప్రసాది కీసుకిడనివి యెవ్విన్. 71

క. మనసున వాక్కునఁ గర్మం
బునఁ బూను ప్రయోజనములు పురుషుఁడొనర్పన్
జనుమఱి లింగార్థమకా
గను నవియు శివప్రసాద గౌరవ మహిమన్. 72

గీ. పరఁగు నిజలింగ లీనమై ప్రాణముక్తి
యగు మనోముక్తి జంగ మాహ్వాయమునందు
శాశ్వతము కాయముక్తి ప్రసాద సేవ
నెఱఁ బ్రసాదికి నిది తత్త్వ నిర్ణయంబు 73

సీ. గురుభుక్తశేషంబు గురుభక్తి భుజియించి
తనదు పెంపున గురుత్వము వహించు
ఘనతరంబైన లింగప్రసాదముసోఁకి
మనసు లింగత్వ సన్మహిమఁదాల్చు
మానితంబగు జంగమ ప్రసాదముదాఁకి
నను నఖండప్రసన్నత వహించు
నగ్నిఁబెట్టినఁ దొంటియాకార మటువోయి
యలరు తృణంబగ్ని యైనయట్టు

గీ. లీ ప్రసాదత్రయంబున నెసఁగు మహిమ,
జ్ఞాన మోక్షప్రదంబు ప్రసాదసేవ
ప్రకటమైన ప్రసాద సేవకుని మహిమ
యజునకైనను వర్ణింప నలవిగాదు. 74

గీ. ప్రాణమునకు నిర్మాల్యత పరుసమునకు
విలువ, సుఖమున కరుచియు వెలయు శుచికి
నెంగిలియు లేని విధమున నెన్ని చూడ
భవము లెన్న ప్రసాది కేర్పడగ లేవు. 75

వ. మఱియు భక్తమహేశ్వర ప్రసాదిస్థలంబు లీ మూఁడును సేవ్య సేవక భావమ్ములు కలుగుటం జేసి అంగస్థలంబు తత్క్రియలు వాశిష్ఠ లైంగ్య భగవద్గీతలు స్తోత్రార్ణవ శివధర్మోత్తరంబులు పలుకునట. ప్రాణలింగి లక్షణంబులు వివరించెద. 76

గీ. బ్రహ్మరూపంబు లింగంబు ప్రాణరూప
మైన చేతన శక్తియై యలరుచుండు,
వీనిరూపంబు లింగంబుగా నెఱింగి
భావమునఁ గొల్చునాతండు ప్రాణలింగి. 77

సీ. బ్రహ్మరంధ్రాఖ్యంబు పరశివస్థానంబు
నందు నిరాలంబమై వెలుంగు
భ్రూమధ్యమునఁ దిగ్మధామ సందీప్తితోఁ
జిన్మయంబై ప్రకాశింపుచుండు
నాసాగ్రమున నిశానాథ కోటిప్రభం
బరిపూర్ణమై మించి ప్రస్ఫురించు
మానసాబ్జంబున మాణిక్య సమరుచి
నధిక తేజోరాశియై తనర్చు

గీ. నిన్ని తావుల లక్ష్యమై యెసఁగునట్టి
పరమ లింగంబునందును భారయుక్తి
నిష్టలింగంబుఁ గూర్చియహీనగరిమ
భక్తి నర్చించునాతండు ప్రాణలింగి. 78

క. దేహము శివాలయంబగు
దేహి శివుఁడు, ప్రాణలింగి ధృతిఁ భూజింప
న్నూహించి భావగత సం
దేహుఁడు విసృష్టమోహా నిర్మాల్యుండౌ. 79

సీ. దేహసంగతమైన దేవాలయంబున
  నాశాదులను కసవపనయించి
గుణవిశేషంబను గోమయంబు ఘటించి
  వినయోదకంబుల వెలయ నలికి
క్రోధాది శిలలు నుగ్గుగఁ గొట్టి చూర్ణించి
  వలనొప్పఁగా రంగవల్లి దీర్చి
మానసంబను ప్రత్తి మమతాఖ్యమనువర్తి
  ననురక్తి యనుతైల మలవరించి

గీ. జ్ఞానదీపంబు ముట్టించి మానసమున
నాత్మలింగంబు సమతాజలాభిషేక
మమరఁ జేసి సమాధిపుష్పములఁ బూన్చి
ప్రమద నైవేద్య మర్పించుఁ బ్రాణలింగి. 80

క. అంగమున లింగసుఖమును
లింగంబున నంగసుఖము లీలాభిరతిఁ
సంగతిగ నెఱుఁగు ధన్యుఁడు
సంగుఁడు ధరఁ బ్రాణలింగి సంజ్ఞం బరఁగున్. 81

వ. అని యిట్లు యోగార్ణవ వాశిష్ఠ తత్త్వసార స్కాందపురాణ భీమసూత్రంబులం బలుకు. మఱి శరణస్థలంబు చెప్పెద. 82

గీ. అనుపమ జ్ఞాన సంగతుఁ డగుటఁ జేసి
యంగలింగి పతివ్రత, హరుఁడు భర్త;
తత్సమాయోగ సౌఖ్య ముత్తమము జగతి
నదియుఁ గలిగిన శరణాఖ్య మతిశయిల్లు. 83

గీ. స్థూలమున నిష్టలింగంబు, సూక్ష్మమునను
బ్రాణలింగాహ్వయంబు, గారణమునందుఁ
దృప్తిలింగంబు లిమ్మూడు దేహములను
సమత ధరియించు నాతండు శరణుఁడండ్రు. 84

క. రానివి మనమునఁ గోరుట
మానుచు సంప్రాప్తమగు సమస్తశ్రీసం
తానమును సమతఁ జూచుచు
హీనసుఖ క్లేశుఁడగు మహిఁ శరణుఁడోగిఁ. 85

క. శివమయుఁడు శరణునకునున్
శివుఁ బూజింపంగ వేఱె చిత్తము గలదే
శివశివ యుదకంబులలో
నవిరళముగ మునుఁగ దప్పియగునా తలఁపన్. 86

గీ. వీఁకమై నేకమై గాడ్పు వీచెనేని
గడిమిఁ బన్నిద్దరర్కులు పొడమిరేని
అంబునిధులన్నియును నేకమయ్యెనేని
చేటులేదెందు శివలీన చిత్తులకును. 87

క. రాగద్వేషము లొదవిన
యోగికి మఱిప్రజ్ఞగను ప్రయోజనమేదీ
రాగద్వేషము లెడలిన
యోగికి మఱి ప్రజ్ఞగను ప్రయోజనమేలా ! 88

క. శివతత్త్వ మెఱుఁగు తఱఁపున
నవహితుఁడై యీషణత్రయ స్నేహమునఁ
దవులక విరక్తినొందుట
శివతత్పర మతులకిదియె శీలంబయ్యెన్. 89

క. పరదైవముండు గృహముల
కరుగక తత్కథలువినక యటు తద్ధ్యాన
స్మరణనిరీక్షణములు లే
కరుదుగఁ దిరుగుటయ శీలమై విలసిల్లున్. 90

క. శివతత్పర భావమునం
దవిలి పరానందయుక్తిఁ దాపత్రయమున్
వివరించి గెలువ నేర్పుట
ప్రవిమల శీలమని యెన్నఁబడుశరణులకున్. 91

సీ. కర్తృత్వమది లేదు గానఁ గర్మము లేదు
కర్మిగామిని జన్మకలన లేదు
భవిగాఁడు గానఁ బొందవు గుణశ్రేణులు
గుణిగాఁడు గాన నాకులత లేదు
కలఁకేమియును లేదు గాన మోహము లేదు
మోహమేమియు లేమి నూహ లేదు
ఊహ లేమియు లేకయున్కి లౌల్యము లేదు
లౌల్యము లేమి నుల్లమును లేదు

తే. సితిలయంబులు లేవు సంగతులు గల్గ
వాదిమధ్యావసానంబు లరయ లేవు
శరణులకు వారి మహిమంబు తరమె పొగడ?
వారు లోకులలో నెన్నువారు గారు. 92

వ. అని యిట్లు వాశిష్ఠకూర్మపురాణ వాతూలతంత్ర స్కాందంబులం బలుకు. మఱి యైక్యుం డెట్టివాఁడనిన. 93

గీ. అధికమైన సౌఖ్యమంది యాశరణుండు
హరునితోడ నైక్య మగుటఁ జేసి
తాన శంభురూపమై నిత్యమహిమల
నతిశయిల్లుచుండు నైక్యుఁ డనఁగ. 94

క. పరిపూర్ణమై యఖండ
స్ఫురణంబున నాత్మఁ దనకు భూతేశునకున్
బొరపొచ్చము లేకుండుటఁ
బొరయఁడు కలలోన భేదమును నైక్యుఁ డిలన్. 95

క. పొగడిన సంతోషింపక
తెగడినఁ గోపంబు లేక తిరమై మోహ
నగితుండుగాక శివునం
దగణిత గుణయుక్తి నుండు నైక్యుం డెందున్. 96

క. సకలప్రాణులయందును
ప్రకటంబగు శివుని నైక్యపంక్తిఁ గొలువన్
వికృతులతఁ డేమిచేసిన
నకలంకుఁడు శివునియందు ననుమోదించున్. 97

గీ. జాతి దూషణ పౌరయందుఁ సూతకాది
దోషమొందఁడు మాసంబు దోసఁగు లేదు
ప్రాణలింగైక్యుఁడగు నేని భాగ్యయుతుఁడు
పావనాచారుఁ డధిగతప్రజ్ఞుఁడతఁడు. 98

క. నిలుచుండుట కూర్చుండుట
మెలఁగాడుట సుప్తుఁడగుట మేల్కొనుటనఁగాఁ
గలుగునవస్థల శివుసం
దొలయుట యాచారనియతి యోగీంద్రునకున్. 99

క. నిఖిలేంద్రియముల సంత
ర్ముఖములు గావించి యైక్యమున నిల్చినచో
సుఖమేక భాజనస్థితి
ముఖరుండగు యతికి లింగమునకుఁ దలంపన్. 100

గీ. సరవితో జ్ఞానమను పాత్ర సంతరించి
పంచ భూతేంద్రియాదిక భవ్యహవ్య
మంతరంగంబుఁ గూర్చి యాత్మాగ్నియందు
వ్రేల్చి సహభోజనప్రౌఢి వెలయు యోగి. 101

వ. ఇట్టి యేకభాజన భోజనంబులు నైక్యునకుఁ దక్క భక్తమహేశ్వర ప్రసాదప్రాణలింగ స్థలంబుల నాచరించువారలకు నలవడవు. అటుగాన బాహ్యంబున లింగంబునకు నైవేద్యము సమర్పించిన పళ్లెరంబుల నేకభాజనభోజన క్రియలాచరించిన నఘోరనరకంబగు నని శాస్త్రములు గలవు. కావున సంగస్థలంబు లిమ్మూఁటను వర్జనీయంబగు. ఇట్లు శివాద్వైత భగవద్గీతల వాశిష్ఠ స్కాందంబుల రుద్రయామిళంబులఁ బల్కు. అల ప్రాణ లింగశరణైక్య స్థలంబు లిమ్మూఁటను వర్జనీయంబగు. ఇవి బాహ్యాంతర క్రియ

లైక్యంబగుటంజేసి శివలింగ స్థలంబనంబడు. ఈచెప్పంబడు షట్ స్థలంబులకుఁ బ్రథమాచారంబున భక్తుండనంబడు. ద్వితీయాచారంబున మాహేశ్వరుఁ డనంబడు, తృతీయాచారంబునఁ బ్రసాదియనంబడు, చతుర్థాచారంబునఁ బ్రాణలింగియనంబడు, పంచమావధానంబున శరణుండనఁబడు. షష్ఠావధానంబున నైక్యండనంబడు. ఇట్టి షట్ స్థలంబులకు నాది భక్తుండు. అట్టి భక్త్యుద్యోగంబు సంసారయోగంబునఁ బొడము. తత్క్రమం బెట్టిదనిన.

చ. నరుఁడు సహస్రకోటిజననంబుల నిష్ఠఁదపంబు సేయుచున్
వరుస మహావ్రతంబులు నొనర్చియు ధ్యానసమాధినుండియున్
బరిపరిభంగులన్ విగతపాపచయుండయి శిష్టసంగతిన్
నిరుపమ శంభుభక్తిని వినిర్మలభావముఁ బొందుఁ బిమ్మటన్. 103

గీ. అట్టి శివభక్తి జనియించినపుడు గల్గు
ఘనతరంబైన సంసారకాననంబు
రోసినపుడు విరక్తుఁడై రూఢికెక్క-
నట్టిముక్తికి నుద్యోగమాచరించు. 104

చ. అనుపమగర్భసంక్రమ నిరర్గళ దుఃఖము జన్మదుఃఖమున్
దనుగతరోగదుఃఖము నతార్యజరామరణోగ్రదుఃఖమున్
గనికర మింతలేక తెగికాలుఁడొనర్చు విచిత్రదుఃఖమున్
మనమునఁ జూచి భీతిఁ ద-ది మర్త్యుఁడు పొందువిరక్తిభావమున్.

గీ. తోలునెత్తురు మాంస మస్థులు పురీష
మూత్రపూయాదు లివిగూడి ముద్దయైన
రోఁత దేహంబు మనమున రోయఁడేని
నతనిఁ గారింప రోయునే యముఁడు తుదిని. 106

గీ. కాంక్ష నార్జించువేళ రక్షణమునందు
వ్రయము గావించునెడలను లయమునపుడు
దుఃఖమొనరించు; లేదు సంతోషలవము
కాన నర్థంబువలన నెక్కడిది సుఖము. 107

క. బలవత్కుటుంబ చింతా
కలితుండగు నరునియెల్ల గుణములు దఱితో
నిలఁ బచ్చికడవఁ బట్టిన
జలములక్రియ మేనితోడ సమయుం బెలుచన్. 108

వ. కావున నసారంబగు సంసారంబు హేయంబని వాశిష్ఠ విష్ణుపురాణ శివధర్మోత్తరంబులం బల్కు. కాన జన్మంబు లనంత దుఃఖంబు లగుటం జేసి మోక్షసుఖంబపేక్షించి విరక్తుండై తత్సుఖప్రాప్తికి గారణంబు లింగార్చనంబుగా నెఱింగి యదీక్షితుండగు మలదేహికి లింగార్చనంబు సేయరామి శివదీక్ష యొసంగునట్టి సద్గురులక్షణం బులు వివరింపవలయు తల్లక్షణంబు లెట్టి వనిన. 109

క. జ్ఞానంబులేని గురువున్
మానుగఁ జేరినను ముక్తిమహితుండగునే
మానవుఁడు జగతిఁ బగిలిన
యానావన్వార్ధిఁగడవ నలవియె యెందున్. 110

గి. జ్ఞానహీనుఁడు గురువైన మానవులకుఁ
గలుగ నేరదు సుజ్ఞాన ఘనత యెందు
మూలహీన ద్రుమంబున మొనయు నెట్లు
పుష్ప ఫలసిద్ధి యిద్ధాత్రి బుద్ధిఁ దలఁప. 111

వ. కావున నిట్టిగురు నాశ్రయింపఁ జనదు. దీక్షితుండు గాకమున్న గురువు గుణలక్షణంబులు విచారింపఁ దగును. దీక్షితుండైన పిదప గురులక్షణంబులు విచారించుటయు నజ్ఞానం బదియెట్లన్న.

గీ. మతివిహీనత నాచార్యు మర్త్యుఁడనియు
బాలుఁ డనియును దుష్టస్వభావుఁడనియుఁ
దప్పియును మానసంబునఁ దలఁపరాదు
జ్ఞానహీనత కదియ యాస్పదము నగును. 113

క. సదయాత్ముఁడైన మనుజుడు
వెదకి గుణాతీత రూప విరహితవస్తు

ప్రదుఁడై నయతని గురువని
ముదమున సేవింపవలయు మోక్షార్థులకున్. 114

క. వాచా మాధురి నలరున
దాచారము లందు నిలిపి యాచారయుతుం
డై చతురత శాస్త్రార్థ హి
తాచారము నిర్ణయించి యాచార్యుఁడగున్. 115

క. మంత్రోద్ధారణక్రమమును
మంత్ర నియోగంబు మంత్ర మాహాత్మ్యంబున్
మంత్రోపదేశ విధమును
మంత్రార్థము నెఱుఁగువాఁడు మాంత్రికుఁడెందున్. 116

వ. అనియిట్లు సిద్ధాంతశేఖర శివధర్మోత్తర వాశిష్టంబులఁబల్కు. మఱి శిష్యుల లక్షణం బెట్టిదనిన. 117

క. అలసునకు హీనమతికిని
ఖలునకు దుర్వ్యసనికట్లు కడుధూర్తునకున్
వెలయ శివదీక్షయిచ్చిన
నలఘుతిరాఘములఁ బొందు సద్గురుఁడెందున్. 118

క. లంజకును మద్యపాయికి
నంజుడు దినునట్టియల్పునకు జూదరికిన్
రంజకునకు దూషకునకుఁ
గొంజక యుపదేశమిచ్చు గురుఁడఘమొందున్. 119

వ. మఱి శివదీక్షకు నర్హులెట్టివారనిన 120

సీ. శివభక్తి గలిగియంచిత మహోత్సాహుఁడై
శివ సమాచార సుస్థితి వహించి
శివపూజనాసక్త చిత్తుఁడై దయమించి
దాక్షిణ్యయుక్తుఁడై దంభమెడలి

మదమత్సరంబులు వదలి సంతతధర్మ
నిరతుఁడై విజ్ఞాననిష్ఠఁదగిలి
విరహితస్పర్ధుఁడై విగతరాగాత్ముఁడై
నిస్పృహాత్వమున నెన్నికకు నెక్కి

తే. గురుపదాంబుజ సేవనాపరతఁ దగిలి
పరుల కుపకారమొనరించు భాగ్యమొదవి
సుప్రసన్నత మోమున సొంపుమిగులు
నతఁడు శివలింగదీక్షకు నర్హుఁడెందు. 121

క. గురుభక్తి నిశ్చలుండై
పరఁగు మనఃకాయ వాక్యపద్ధతు లతిసు
స్థిరమగు వినీతి గలిగిన
నరునికి శాసింప శిష్యనామముదాల్చున్. 122

క. తిగిచినఁ గొట్టినఁ దిట్టిన
వగవక సంతోషపడక వర్తించునరున్
సుగుణాఢ్యుఁడైన దీక్షితుఁ
డుగఁ జేయఁగవలయు నెక్కుడుగృపగురుండున్. 123

క. అచలితుఁడై గురుసన్నిధి
శుచుఁడై నరుఁడుండవలయు సుఖముడిగివ్రతం
బుచితముగ నాచరించుచు
నచరముతో జ్ఞానసిద్ధియగునందాఁకన్. 124

క. చిత్రములగు నీగుణముల
ధాత్రిం గొనియాడఁ దగిన ధర్మాత్మునకున్
బాత్రుఁడయినట్టి గురువు ప
విత్రుంగావించి దీక్షవిధియింపఁ దగున్. 125

సీ. చిత్కళాదృష్టి దేశికుఁడాత్మవనజంబు
దృష్టిలింగంబు భేదింపఁజేసి

శిరముపై హస్తంబుఁ జేర్చి కర్ణంబునఁ
ప్రణవపంచాక్షర భవ్యమంత్ర
ముపదేశ మొనరించి యొప్పఁగాఁ గద దాత్మ
లీల నాకర్షించి లింగతనువు
నందుఁ బ్రతిష్ఠించి యాలింగమును వాని
కమనీయమైన యంగంబునందు

తే. సుస్థిరంబుగ నిల్పియతఁడు భద్రమహిమ
నిశ్చల జ్ఞాన యోగంబు నెఱపవలయు
నివ్విధంబున దీక్ష పెంపెసఁగు నతఁడు
ఉత్తరోత్తర మభివృద్ధినొందుచుండు. 126

ఉ. అన్నిగుణంబులుంగలిగి యన్వయశుద్ధివహించి దిక్కులన్
సన్నుతుఁడైన దేశికుని సత్కృప దీక్షితుఁడయ్యె నేని న
భ్యున్నతిఁగాంచు శిష్యుఁడిహమున్ బరమున్ బరిపూర్ణబోధుఁడై
యెన్నిక కెక్కునట్టి గురునీశ్వరబుద్ధి భజింపఁగాఁదగున్. 127

క. హరదీక్ష వడయునంతట
నిరవగు సద్గురువుశిష్యుఁ డెంతయు మహిమన్
బరతత్వ మయుతఁ దాల్చును
గురు నుపదేశక్రమంబు గొనకొనుమాత్రన్. 128

ఉ. హార పటీర హీర దరహాస బిసాంకుర కుంద మల్లికా
తారక తారభూధర సుధాకర శారద శారదాభ్ర క
ర్పూర తుషార పారద నభోగజరాజ విశుద్ధ కీర్తి వి
స్తార, సుమేరుధీర, సువిచార, యగోచర పుణ్యమందిరా! 129

క. హర చరణ భక్తితత్పర,
పరహితచారిత్ర, వంశపావన, లోకో
త్తరమహిమ, వినయ విశ్రుత
కరుణాకర, నియమధుర్య, గాంభీర్యనిధీ! 130

ఉత్సాహ.

నిరుపమాన మానభావ నిత్యసంపమున్న తా !
నిరతిశయమహాప్రభావ, నిత్యసత్యవై భవా !
గురుకృపా విశేషధామ, కులపయోధిచంద్రమా !
చరసమంచితావధాన సహజభోగసాధనా. 131

## గద్యము

ఇది శ్రీ దుర్గాంబికావరప్రసాదాసాదిత కవితా విలాస భాసుర శ్రీమదహోబలామాత్యపుత్ర సుకవిజనమిత్ర సకలవిద్యానిధాన తిరుమలనాథాభిధాన ప్రణీతంబైన శైవాచారసంగ్రహంబను కృతి యందు నైవేద్యలక్షణంబును, కర్పూరయుక్తంబగు తాంబూలం బర్పించుటయుఁ, బ్రదక్షిణ నమస్కారంబును లింగార్చన కాల విశేషంబులు, ఆ లింగోదక పాదోదక ప్రసాదోదక మహత్త్వం బును, ప్రసాదసేవాగ్రాసగ్రాసలక్షణంబును. భక్తమహేశ్వర ప్రసాద ప్రాణలింగ శరణైక్య షట్ స్థలంబుల ప్రకారంబును, సంసార హేయత్వంబును, గురుశిష్యలక్షణంబును నన్నది సర్వం బును దృతీయాశ్వాసము సమాప్తము.

సంపూర్ణము



